

**THE LONELY LADY:** Neglected by the BMC, affected by pollution, painted over, Flora stands alone even on her birthday.

# మిసిమి

*"All that we are is the product of what we have thought,"*
*is "We are what we think."* – **Dammapada.**

సంపుటి 6 | ఫిబ్రవరి 1995 | సంచిక 67

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 5/-    వార్షిక చందా రూ. 60/-

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

# 'మిసిమి' కి రచయితల కాటకము

నమస్కారములు. ఇంతవరకు **మిసిమికి** మీరు అందించిన సహకారం అనన్యం. మీ కారణంగానే మిసిమి వాసి, వన్నె పెరిగాయి. పత్రికా లోకంలో తనకంటూ, తనదైన విశిష్ట స్థానాన్ని సంతరించుకొంది. ఆంగ్లంలో "The Mind" అనే పత్రిక ఉంది. దానిలో వ్యాసం అచ్చయితే ఆ వ్యాస రచయితకు ఒక డాక్టరు పట్టా ఇవ్వవచ్చు అంటారు. అలాంటిదే ఇంగ్లాండ్ నుండి లోగడ వెలువడిన "The Encounter'. **మిసిమి** ఆ స్థాయికి చేరకపోయినా, తెలుగు పత్రికా ప్రపంచంలో మాత్రం **మిసిమి** వాటికి ధీటైనదేనని విజ్ఞులు వెలిబుచ్చిన అభిప్రాయం. దీనికిమీ రచనా కౌశల శీలాలే ముఖ్య కారణమని మిసిమి వేరుగా మనవి చేయవలసిన పని లేదు.

ఇప్పుడు **మిసిమి** ఒక విచిత్ర పరిస్థితిని ఎదుర్కొంటున్నది. అది ''డబ్బు కొదవ'' కాక ''రచయితల కాటకం''. ఈ కాటకంతో మీ **మిసిమి** అలమటిస్తోంది. పునర్ముద్రణలను ఆశ్రయిస్తుంది. పత్రిక కొనసాగాలంటే ఈ 'కరువు' ను అధిగమించాలి. అందుకు మీ 'సృజనాత్మక సహకారాన్ని' మిసిమి అభ్యర్థిస్తోంది.

అంతే కాదు, మీకు తెలసిన, మీ స్థాయి లేదా అంతకు పై స్థాయిలో రచన చేయగల వారిని సూచించమని **మిసిమి** కోరుతున్నది. వారిని మీరే ప్రోత్సహించి రచనలను పంపే బాధ్యతను స్వీకరిస్తే **మిసిమి** మరింతగా సంతోషిస్తుంది. **మిసిమి** ఒరవడి, ఉరవడి, స్థాయి, ప్రమాణం, విలువలు, విషయ వైవిధ్యం మీరు ఎరుగనివి కావు కదా.

మీ ప్రతిస్పందన మీద అధారపడి తన మనుగడ సాగించాలో. చాలించాలో మిసిమి నిర్ణయించుకొనే సమయం వచ్చింది.

**మిసిమికి** రచనల కాటకంవల్ల అంతర్హితమైన, ఈ కాటకం నుంచి బయటపడి బ్రతికి బట్టకట్టినా ఆ చలవ మీదే.

**సంపాదకుడు**
**మిసిమి**

# నేటి తెలుగు ప్రమాణీకరణం

- బూదరాజు రాధాకృష్ణ

(మద్రాసులో జరిగిన ప్రపంచ తెలుగు సభలో సమర్పించిన వ్యాస సారాంశము)

ప్రపంచంలోని నాగరక భాషలన్నిటికీ ఏదో ఒక విధమైన ప్రామాణిక భాషారూపం ఉంది కాబట్టి తెలుగు భాష క్కూడ అలాంటిది అవసరమని భావించటంలో వింతలేదు. తెలుగు భాషలో అపారమైన వైవిధ్యముంది. ధ్వని, వర్ణపద, పదబంధ, సంధి, వాక్యస్థాయిల్లో కనిపించే వైవిధ్యం నుంచి ఎక్కువమందికి ఆమోదయోగ్యమైన లక్షణాలను క్రోడీకరించి సూత్రీకరించ టమే ప్రమాణీ కరణమనేది సాధారణాభిప్రాయం. అయితే ప్రమాణీకరించే విధానాలమీదనే గాక అవసరం గురించి కూడా ఏకాభిప్రాయం లేదనేది వాస్తవం. అసలు భాషా శబ్ద నిర్వచనం మీదనే భిన్నాభిప్రాయాలున్నాయి. ఒక వ్యక్తి మాట్లాడేది భాష, ఒక కుటుంబంలోని సభ్యులు తమలో తాము మాట్లాడుకునేదీ భాషే. జనాభాలెక్కల ప్రకారమయితే ఒకే వ్యక్తి మాట్లాడు తున్న (?) భాషలు వందల సంఖ్యలో ఉన్నాయి. ఎవరితో మాట్లాడుతున్నారో గణాంకాలు వివరించవు కాబట్టి తెలియదనటమే మంచిది. రకరకాల సమూహాలు మాట్లాడేది కూడా భాషకిందే లెక్క. ఒకరి మాటలు మరొకరికో మరికొంతమందికో అర్థమవుతున్నంతకాలం ఆ విధంగా వ్యవహారం నడుపుతున్న వారందరూ ఒకే భాషమాట్లాడుతున్నారని చెప్పవచ్చు. కానీ ఆ భాషలోని ధ్వనులు, పదాలు, పదబంధాలు అన్ని సందర్భాల్లో అందరికీ ఒకేవిధంగా అర్థమవుతున్నాయనిగాని, ఒకే అర్థమిస్తున్నాయనిగాని, ఒకేరూపంలో ఉన్నాయనిగాని, తద్విరుద్ధంగా లేవనిగాని చెప్పలేం. ఈ భేదాలను పురస్కరించుకొని వైయక్తిక భాష (ideolect) స్థానిక మాండలికం (local dialect), ప్రాంతీయ మాండలికం (regional dialect), వర్గ మాండలికం/వృత్తి మాండలికం (class dialect), కుల మాండలికం (sociolect) మొదలైన సాంకేతిక పదాలు వ్యవహారంలో ఉన్నాయి. అయితే వీటిలో చాలావరకు సమానలక్ష ణాలున్నాయి కాబట్టి ఆ భేదాలన్నీ ఒకే భాషలోని అంతర్గత విభేదాలనిగాని, భిన్నరూపాలని గాని పరిగణిస్తుంటాం. అర్థబోధ ఈ సందర్భంలో ప్రధానాంశమైనా సమీపార్థబోధ ప్రకరణం (context) మీద ఆధారపడి సాధ్యమవుతుంది. ఇవిగాక ఒకేవ్యక్తి భిన్న సందర్భాల్లో భిన్నశ్రోత లతో మాట్లాడేటప్పుడు ఉచ్చారణలో, పదప్రయోగంలో అంగవిన్యాసంలో చేసే మార్పులు శైలీ భేదాలని (stylistic changes) పరిగణిస్తారు. రహస్యంగా మాట్లాడేప్పుడు వక్తృశ్రోతలు భాషా లక్షణాల్లో మరికొన్ని మార్పులు ప్రదర్శిస్తారు. సభలో మాట్లాడేతీరులో మిత్రులతో ఏకాంతంలోనో సరదాగానో మాట్లాడేటప్పుడు మరికొన్ని విలక్షణతలు బయటపడ్తాయి. ఈ లక్షణాన్నిబట్టి ఔపచారిక (informal) లాంఛనప్రాయ (formal) ప్రసంగాలు ద్వివిధభాషా లక్షణాలుగా భాసిస్తాయి. సంబోధనలో (address) ఒక రకంగా, ప్రస్తావనలో (reference) ఒకరకంగా పదజాలం మారిపోతుంది. లింగభేదాలనుబట్టి వక్తృభాష మారుతుంది. ఇలా అనేకం. ఇంత వైవిధ్యమున్న భాషా విరాడ్రూపాన్ని కొన్ని నియమ నిబంధనల ప్రకారం వీలయినంత ఏకరూపతకు తెచ్చే ప్రయత్నమే ప్రమాణీకరణ. పద్యగేయవచనాది రచనా భేదాలను బట్టిగూడా భాషారూపాలు, అర్థనిరూపణ మార్పులు పొందుతుంటాయి. భాష అనేది వాగ్రూపం నుంచి లిఖితరూపంలోకి మారినప్పుడూ లిఖితరూపం నిర్దిష్ట లక్షణాలున్న

సాహిత్యరూపంగా పరిణమించినప్పుడూ, మరికొన్ని మార్పులు పొందటం సహజం. లిఖిత వాగ్రూపభాషలు పరస్పరం ప్రభావితం చేసుకొన్నందువల్లనేగాక కాలగమనంలో కూడా అనేక పరిణామాలు వస్తాయి. ఇన్నిటినుంచి సమాన లక్షణాలను గ్రహించి సూత్రీకరించి ప్రమాణీకరించటం కష్టసాధ్యం. మార్పులు అనేకం. అందుకు కారణాలనేకం. వైవిధ్యం అనంతం. అందువల్ల ప్రమాణీకరణ ప్రయత్నాల్లోసహజంగానే భిన్న సిద్ధాంతాలూ పద్ధతులూ ఉత్పన్నమై అసలు సమస్యను మరింత జటిలం చేస్తాయి - చేస్తున్నాయి.

ప్రాచీన సమాజంలో విద్యావంతులకూ ఉన్నత వర్గాలవారికీ ముఖ్యంగా కవులకూ ఎక్కువ గౌరవం ఉండేది. వారిని శిష్టులుగా పరిగణించి వారి భాషా లక్షణాలను సాధ్యమయినంతవరకు క్రోడీకరించి సూత్రీకరించారు. వారి భాషా విశేషాలను సాధువులన్నారు. తక్కిన భాషారూపాలను అసాధువులన్నారు. ఒక కవో పండితుడో పరిచయాధిక్యం వల్ల ఇతర భాషా రూపాలను ప్రయోగిస్తే వాటిని అనింద్యగ్రామ్యాలన్నారు. తక్కిన రూపాలను నింద్యగ్రామ్యాలనీ ప్రయోగానర్హాలనీ తేల్చివేశారు. మహాకవి ప్రయోగాలకు పెద్దపీట వేశారు. తక్కిన రచయితలను గూడా చిన్నచూపు చూశారు. వ్యాకరణ గ్రంథాలు రచించారు. గ్రంథాలే, వాటిలోని సూత్రాలే, వ్యాకరణమన్నారు. వ్యాకరణ విరుద్ధమైన భాష గ్రామ్యమనీ, దూష్యమనీ భావించారు. అప్పట్లో విద్యావంతుల సంఖ్య అత్యల్పం. అగ్రవర్ణాల భాషకే శిష్టభాషాత్వం ప్రామాణికత్వం కట్టబెట్టారు. ఇరవయ్యో శతాబ్దం ప్రథమ దశాబ్దం నాటికూ్కడా ఈ పరిస్థితిలో మార్పులేదు. అందుకు గిరాంమ్మూర్తిగారి వాక్యాలే సాక్ష్యం.

''తెలుగువారి జనసంఖ్యలో బ్రాహ్మణులు 3 శాతం మాత్రమే. విద్యావంతులైన ప్రతి నలుగురు తెలుగువాళ్ళలో ఒక్క బ్రాహ్మణుడున్నాడు. కానీ బ్రాహ్మణుల్లో కూడా 60 శాతం మంది తమ పేరు కూడా రాయలేనివాళ్ళే. ప్రతి వెయ్యిమంది తెలుగువాళ్ళలో 925మంది ఇప్పటికీ పూర్ణ నిరక్షరాస్యులు.'' (నేటి తెలుగు - నివేదిక, 1891, పే.23)

మన అక్షరాస్యత పరిస్థితిలో ఇప్పటికి చాలా మార్పు వచ్చింది. అయినా ఇప్పటికీ చాలామంది పండితుల తత్వం మారలేదు. పాతకాలం వారి పనీ పాతబుద్ధులున్నవారి పనీ ఒకవిధంగా సులభం. వారికి సమాజ పరిస్థితులతో కాలగమనంతో సంబంధం లేదు - అక్కరలేదు. ఏవో కొన్ని సూత్రాలు రాసి వాటికనుగుణంగా లేని భాషారూపాలు తప్పన్నారు. ఉదాహరణకు పడకటిల్లు, కమ్మటూరు, దుక్కిటెద్దు కర్మధారయ సమాసాలయినా, బహుళ వ్యాప్తిలో వ్యవహారంలో ఉన్నా, పూర్వశబ్దాలు ఉదంతాలు కావు కాబట్టి వాటికి టుగాగమం రాదన్నారు. వచ్చిన రూపాలు అసాధువులన్నారు. అప్పట్లో విద్యావకాశాలు స్వల్పం. అధికారం కేంద్రీకృతం. శ్రీ కృష్ణదేవరాయలు చిన్నయసూరి దృష్టిలో ఆధునికుడు. పాల్కుర్కి సోమన ప్రామాణికుడు కాడు. శాసన ప్రయోగాలు వ్యాకరణ విరుద్ధాలు. కనీసం పతంజలిలా భిన్న ప్రాంతాలలో ఉచ్చారణ భేదాలను ప్రస్తావించటం కూడ తమ పని కాదనుకున్నారు. వచన రచనలు అసమర్థ ప్రక్రియలనుకున్నారు. భాషలో శ్రీనాథాదులు గుర్తించి ప్రయోగించిన అన్యదేశ్యాల రూపనిష్పత్తి సంగతే పట్టించుకోలేదు. అచ్చతెలుగు పదాల విషయంలోనే ఆపని శ్రద్ధాసక్తులతో చేయలేదు - ఏదో తట్టతగలేసినట్లు కొన్ని ప్రకృతులనూ ప్రత్యయాలనూ పేర్కొని సరిపెట్టుకున్నారు. వాక్య నిర్మాణ విషయం మనసు కెక్క లేదు. భర్తృహరి మొత్తుకున్న అఖండ వాక్య స్ఫోట విషయం తలకెక్కించుకోలేదు. హిందీ ఉర్దూలద్వారా వచ్చిన ఎరువు మాటలను రూపభేదాలతో గ్రహించి అచ్చతెలుగు కింద జమకట్టారు. ఇలా ఎన్నో! అయితే కొన్ని భాషా సాధారణ లక్షణాలను ప్రమాణీకరించా

రని అంగీకరించక తప్పదు. ఆ ప్రమాణీకరణకు అనుగుణం గాని ప్రాచీన ప్రయోగాలను 'పరిష్కరించి' (అంటే అచ్చ తెలుగులో తమ అభిరుచి పరిజ్ఞానాల కనుగుణంగా 'దిద్ది') గ్రంథ ప్రచురణ చేసే కుసంప్రదాయం నెలకొల్పారు. అప్పటివారికి సంస్కృత ప్రాకృత వ్యాకరణ రచనలతో ఉన్నంత మమైక్యం సంస్కృత వ్యాకరణ సిద్ధాంతాలతో లేదని చెప్పవచ్చు. ఇతర ప్రపంచ భాషల్లో ప్రమాణీకరణం ఎలా జరుగుతున్నదో వాళ్లు పట్టించుకో లేదు.

కాలక్రమాన ఆంగ్లవిద్యద్వారా, పారిశ్రామికీకరణ వంటి పరిణామాలద్వారా, పాశ్చాత్య పండితులకు పరిచయమైన భిన్నభాషల విషయం తెలియటం మొదలయింది. లాటిన్ వ్యాకరణ ప్రభావం మన వ్యాకరణాల ప్రభావం లాగానే ఉన్నా భాషా పరిణామక్రమం ఎలా కొనసాగిందో కొద్దికొద్దిగా అర్థం కావడం మొదలయింది. భాషలకు ఏక ప్రమాణమే ఉండనక్కరలేదన్న భావంతో బాటు ప్రమాణీకరణం ఎలా జరగాలన్న అంశంపై వచ్చిన వాదవివాదాలు తెలియటం ఆరంభమయింది. చారిత్రక దృక్పథమనేది ఒకటుందని తెలియ వచ్చింది. సహజ పరిణామవాదం తెలిసివచ్చింది. సాహిత్య ప్రమాణ మొక్కటే ఉపాదేయం కాదన్న భావన కలిగింది. వ్యాకరణాల్లో కూడా ప్రయోజన దృష్టితో భేదాలున్నాయనీ, ఏఒక్కటీ సర్వాధికారం చెలాయించకూడదనీ అనిపించింది. తప్పొప్పులనేవి భాషలో నిర్ది ష్టంగా శాశ్వతంగా ఒకేవిధంగా ఉండవనీ వ్యాకరణ సంప్రదాయం కూడా ఏకరూపం కాదనీ బోధపడింది. అయినా ప్రమాణీకరణ ఫలితంగా అప్రమాణిక ప్రయోగాలన్నీ తప్పులనే దుర్భావం వ్యాపించే అవకాశముంది. పాశ్చాత్యులు ప్రమాణీకరణ విధానాలను అనేకరకాలుగా చర్చించారు. అడాల్ఫ్‌నొరీన్ (1895) మూడు ముఖ్య పద్ధతులున్నాయన్నాడు. వాటిలో మొదటిది సాహిత్య చారిత్రక పద్ధతి (literary historical method). దీని ప్రకారం పురాతన రూపాలనూ పూర్వకవి ప్రయోగాలనూ ప్రామాణికాలుగా నిర్ణయిస్తారు. ఇందువల్ల పరిణామ క్రమంలో ఏర్పడ్డ ఆధునికరూపాలన్నీ అసాధువులవుతాయి, కవులు భాషా స్వరూప నిర్ణేతలవుతారు. ఈమార్గాన్ని గ్రిం, రిడ్ క్విస్టువంటివేత్తలు అనుసరించారు. రెండోది సహజ పరిణామ పద్ధతి (natural-historical method). ఈ మార్గంలో ఆయా నిర్దిష్ట చారిత్రక దశల్లో ఆయాభాషా లక్షణాలు సాధువులవుతాయి. ఇది అరాజక సిద్ధాంతం (anarchic theory) అని ఆక్షేపించిన ఆటో యెస్పర్సన్ తానుగా ఏడు ప్రమాణాలున్నాయని వాదించాడు. మూడోదయిన తార్కిక లౌకిక పద్ధతిని (rational commonsense method) అతడే అవకాశవాద సిద్ధాంతమని తోసిపుచ్చాడు; నేల విడిచిన సామని అధిక్షేపించాడు. ఈ మూడు పద్ధతులనూ సూచించిన నొరీనే దరిమిలాతన సిద్ధాంత ప్రతిపాదనలను ఉపసంహరించుకొని టెగ్నర్ వాదాన్ని అంగీకరించాడు. అతడి భాషాసౌలభ్య సిద్ధాంతం ప్రకారం సులభతమమైన ఉచ్చారణకు వీలయిన రూపాలే సాధువులు; తక్కినవి కావు. ఇది భాషాప్రయోగాన్నేగాని సాధుత్వాన్ని నిరూపించదని సెతాలా ఆక్షేపణ. యెస్పర్సన్ పేర్కొన్న ఏడు ప్రమాణాలు: 1.పండిత ప్రమాణం, 2.భౌగోళిక ప్రమాణం, 3.సాహిత్య ప్రమాణం 4.ప్రజాస్వామిక ప్రమాణం 5.కులీన ప్రమాణం (aristocratic standard). 6.తర్క ప్రమాణం 7.ఆలంకారిక ప్రమాణం (aesthetic standard) పండిత పరిషత్తుల నిర్ణయాలద్వారా సాధుత్వ నిరూపణ నెరవేరిన దాఖలాల్లేవు. ఏదో ఒకప్రాంతీయ మాండలికమే సారస్వత ప్రతిష్ఠ సంపాదించిన ప్పుడు తప్ప భౌగోళిక ప్రమాణం నిలవదు. సాహిత్యమే నిర్దుష్ట ప్రమాణమనటం కుదిరేది కాదు. విద్యాబుద్ధులు లేని కులీనులు ప్రామాణ్యం సాధించలేరు. తర్కాతీతమైన భాషకు తర్క పద్ధతులు ప్రామాణ్య నిర్ణయంలో తోడ్పడవు. అలంకారిక ప్రమాణం ఆత్మాశ్రయ

పద్ధతిలో తప్ప సాధువుకాదు. 'పదుగురాడుమాట పాటియై ధరజెల్లు' ననేది చాలావరకు పనికివస్తుంది. ఆవిషయాన్ని నిరూపించాలంటే పెద్దయెత్తున సర్వేచేసి బహుజనామోదం పొందిన లక్షణాలను సేకరించవలసియుంటుంది. అది స్వల్ప వ్యవధిలో సాధ్యమయ్యే పనికాదు. దేశకాల పరిస్థితులనుబట్టి జీవద్భాష మారిపోతుంటుంది. కాబట్టి ఏదో ఒక ప్రమాణానికి అంటిపెట్టుకొని ప్రమాణీకరించటం సరైన పద్ధతికాదు. వాడుకలో లేనిది అప్రామాణిక మనటం సులభమేగాని నిరూపించటం కష్టం.

అమూర్తమయిన భాషలో ఏయే అంశాలు ప్రామాణికాలో చర్చించేకన్నా ప్రామాణిక భాషకున్న ప్రయోజనాలను గుర్తించటం మంచిది. ఆర్.ఇ.కెల్లర్ ప్రామాణికభాష అనేది ఈ లక్షణాలున్నదని పేర్కొన్నాడు:

1. భాషాభాషులందరూ ద్వితీయభాషగా నేర్చేది. 2. భావిపౌరులకు నేర్పేది. 3. అన్యభాషల వారు నేర్చుకొనేది. 4. ఎక్కువమంది శిష్టులు మాట్లాడేది, రాసేది. 5. ప్రాంతీయతాబద్ధం కానిది. 6. మాండలిక భేదాలను కలుపుకొనేది. 7. అనేక సమయాల్లో అత్యధిక సంఖ్యాకులు వాడేది. 8. వ్యాకరణ నియమాలు నిరూపించేది. 9. రూపనిష్పత్తి చర్చ జరిగేది. 10. ఎవరికీ మాతృభాషకానిది.

పైన పేర్కొన్న లక్షణాలూ ప్రయోజనాలూ లేనివి మాండలికాలు.
మాండలికం అనేది - 1. ప్రమాణభాషకు ఆధారభూతమయింది. 2. నిరక్షరాస్యుడు వాడే ఏకైక భాషారూపమయింది. 3. ప్రాంతీయంగానో వృత్తిపరంగానో స్వతంత్రమయింది. 4. ఎరువు మాటలను స్వీకరిస్తూ కూడా వాడుక చేయనిది. 5. అనుక్షణం మారుతూ ఉండేది. 6. అశ్రమంగా వక్తలు మాట్లాడగలిగేది. 7. నియమబద్ధంకానిది. 8. ఆక్షేపణీయం కానిది. 9. స్వయం సంపన్నమయింది. 10. వ్యక్తీకరణలో సమ్మోహనశక్తి కలది.

ఇలా కొన్ని లక్షణాలను నిర్దేశించవచ్చుగాని ప్రామాణిక భాషనూ మాండలికాలనూ నిర్దుష్టంగా విస్పష్టంగా నిర్వచించటం సాధ్యపడదు. అందుకు కారణం ఆరెండూ అమూర్తభావనలు (abstract concepts) కావటమే. ప్రామాణికభాష అనేది సాధారణంగా లిఖిత రూపంలో ఉంటుంది. విద్యావంతులు వాడే సభా సాధురూపంలో సమకాలంలోని వచన రచయితలు సామాన్యంగా ప్రయోగించే విధంగా ఉంటుంది. భిన్న మాండలికాల్లో వ్యవహరించే ప్రజలందరికీ అందుబాటులో ఉండే సమన్విత లక్షణాలతో, సుదూర మాండలిక వ్యవహర్తల మధ్య అవగాహన పెంచేందుకు ఉపయోగపడుతుంది. నిర్దిష్ట లిఖితరూపంలో బహువిధ చర్చోపచర్చల ఫలితంగా సూత్రబద్ధమవుతుంది. ప్రామాణిక భాషా సూత్రాలకు అపవాదాలుంటే అవి ఏదోఒక లేదా అనేక - మాండలికానికో మాండలికాలకో ప్రాతినిధ్యం వహిస్తాయి. ప్రామాణిక భాష కాలాంతరంలో మారినా ఎక్కువకాలం ఏకరూపంలో ఉంటుంది. మాండలిక భాషారూపాలను తనలో ఇముడ్చుకోగలుగుతుంది. మాండలిక రూపాలతో పోలిస్తే ప్రామాణిక రూపాలు స్థిరత్వం ప్రదర్శిస్తాయి. భాషాభాషులు నిరాలోచనగా అనుకరించేవి ప్రామాణిక రూపాలే. వాటికి సంఘంలో గౌరవముంటుంది. ప్రామాణిక భాష స్వీకరించి ఆమోదించి ప్రయోగించే ప్రతిఒక్క ఎరువు మాటా దాని అభివృద్ధికీ, నవీకరణకూ, విశ్వ జనీనతకూ దారితీస్తుంది.

మాండలికాలకు నిర్దిష్ట ప్రమాణాలుండవు. వ్యవహర్తలు కావాలని అనువర్తించే నియమాలుండవు. మాండలికం సహజం, సులభం, ఆమోదయోగ్యం. దాని పరిణామం వేగవంతం.

అందులో నవకల్పనలు (innovations) అనేకం, అనల్పం. మాండలికాలు ఎరువుమాటలను స్వీకరిస్తాయిగాని జీర్ణం చేసుకోవు. ఎరువు మాటలవల్ల మాండలికాల వ్యక్తీకరణ స్వాతంత్ర్యం కొంత దెబ్బ తింటుంది. ఉచ్చారణ విలక్షణత మాండలికానికి ఊపిరి. స్వయం సమృద్ధమైన మాండలికం అన్యదేశ్యాలవల్ల సహజత్వం కోల్పోతుంది. మాండలికాలనుంచి ప్రమాణభాష ఏర్పడుతుంది. ప్రాంతీయ మాండలికాన్ని సమర్థ రచయితలు గ్రంథ రచనకు ఉపయోగించినప్పుడు అది మరో ప్రామాణ్యం సంపాదిస్తుంది; ప్రామాణికభాషకు ప్రతిద్వంద్వి కాగలుగుతుంది. భాషా భాషల్లో అత్యధిక సంఖ్యాకులకు ఆమోదయోగ్యమైనప్పుడు ప్రాంతీయ మాండలికం రాణిస్తుంది.

సమాజనీతిలాగానే ప్రామాణిక భాష ప్రయత్నపూర్వకంగా నేర్చుకొని ఆచరణలో పెట్టవలసిందే. దానికి సమర్థత (efficiency) యుక్తియుక్తత (rationality), సాధారణత్వం (commonality) అనే మూడు ప్రధాన లక్షణాలుండాలి. వాటిని పెంపొందించడానికి నూతన భావనలూ నూతన పదజాలం అవసరం. అన్యదేశ్యాలు చాలావరకు అకొరతలు తీరుస్తాయి గాని వాటి సంఖ్య పెరిగేకొద్దీ ధ్వనుల్లో, పదస్వరూపాల్లో, పదబంధాల్లో, చివరికి వాక్యరచనలో కూడా ప్రామాణిక భాష మారుతుంటుంది. అంటే లేఖన సంప్రదాయాల్లో పద (బంధ) స్వరూపంలో వ్యాకరణంలో విలువలు మారుతాయన్నమాట. సామాజికావసరాలూ ప్రయోజనాలూ ఈ పరిస్థితికి కారణాలు. పూర్వం ప్రామాణిక భాషా ప్రయోగం (పద్య) సాహిత్యానికే పరిమితంగా ఉండేది. ఇప్పుడు ఉన్నత విద్యాబోధన మాధ్యంగా. రాజకీయ పరిపాలన మాధ్యంగా, న్యాయశాసన చర్చా విధానాల్లో మాధ్యంగా తెలుగు వాడుక అనుక్షణం పెరుగుతున్నది. ఆయారంగాల్లో భాషా ప్రయోగాభివృద్ధి సాధించటానికి రకరకాల సంస్థలూ శాఖలూ వెలుస్తున్నాయి. సాంకేతిక పదాలు భిన్న భాషలనుంచి వచ్చి చేరుతున్నాయి. అందువల్ల ఆధునిక ప్రామాణికం నిరంతర పరివర్తనశీలంగా ఉంది. సమస్యలు పుట్టినంత వేగంగా పరిష్కారమార్గాలు దొరకటం లేదు. ఈ ఆదానంవల్ల ప్రమాణీకరణంలో కొన్ని చిక్కులు వస్తున్నాయి. ఉదాహరణకు -

(i)ధ్వని వర్ణాలస్థాయిలో: ఇంగ్లీషులో ae (ఎ) & (ఫ) లకు సమానమైన లేఖన చిహ్నాలు తెలుగులో లేవు. వాటి స్వరూపాలను నిర్ణయించ వలసివుంది. ఈధ్వనులున్న శబ్దాల సంఖ్య అపారం.

(ii)పదస్థాయిలో: మూలభాషలో రెండు రకాల ఉచ్చారణ ఉన్నా ఒకేరకం లేఖన మర్యాద ఉన్నప్పుడు కొన్ని చిక్కులున్నాయి. 'algae' అన్న పదాన్ని తెలుగులో 'ఆల్గే' అని రాయాలా, 'ఆల్జీ' అని రాయాలా అన్నదో ప్రశ్న.

(iii)పదబంధ స్థాయిలో : 'Government girls high school' అన్న సమాసాన్ని 'ప్రభుత్వ బాలికోన్నత పాఠశాల' 'బాలికోన్నత ప్రభుత్వ పాఠశాల', 'బాలికా ప్రభుత్వోన్నత పాఠశాల' అనే రూపాల్లో ప్రమాణీకరించ వలసిన రూపమేది అన్నదో ప్రశ్న. ఎట్లా రాసినా సందిగ్ధత తప్పదు.

(iv) వ్యాకరణ స్థాయిలో : 'bacterium-bacteria' - అని ఏకబహువచన రూపాలున్న పదాన్ని తెలుగులో రాసేటప్పుడు బహువచన రూపం 'బాక్టీరియాలు' అని ఆధునిక పద్ధతిలో రాస్తే మూలభాష తెలిసిన వ్యక్తికి రెండు బహు వచన ప్రత్యయాలు వాడినట్లనిపిస్తుంది. కర్మణి ప్రయోగ బాహుళ్యం మరో సమస్య అనువాదకుడికి.

పై విషయాలను ఆయా రచయితల వైయక్తిక స్వాతంత్ర్యానికే వదలి పెట్టాలనే వాద ముంది. వ్యక్తులు తమంత తాముగా సృజనాత్మక సాహిత్యం సృష్టించి నప్పుడుగాని, శాస్త్ర గ్రంథ రచన చేసినప్పుడు గాని తమతమ ఇష్టానుగుణంగా వ్యవహరించవచ్చు. ఆ రచనలు వైయక్తిక భాషా స్వరూపాలకు నిదర్శనాలవుతాయి. భిన్న ప్రయోజన సాధనల కోసం భిన్న సంస్థలేర్పడి, అవి తమ ప్రచురణలకు ఏకరూపత కల్పించ వలసినప్పుడు, ఆ సంస్థల్లో పనిచేసే వారు రకరకాల అనుభవ జ్ఞాన ప్రభావాలకు లోనైనప్పుడు, ప్రమాణీకరణం అవశ్య కర్తవ్యం. ఆధునిక ప్రపంచంలో అపారంగా శాస్త్ర విజ్ఞానం విస్తరిస్తున్న సమయంలో, పారిభాషికాలు అసంఖ్యాకంగా వాడుకలోకి వస్తున్నప్పుడు, నూతన భావనలు అనంతంగా ఉన్నప్పుడు వాటిలోని సాధారణ లక్షణాలను క్రోడీకరించి ప్రమాణీకరించక పోతే మిగిలేది అవ్యవస్థ మాత్రమే. సాంకేతిక పదాలను ప్రమాణీకరించటానికి ప్రపంచ సంస్థలే నిరంతరం పరిశ్రమిస్తునాయి. యూజిన్ మస్టర్ వంటివాళ్ళు ఉద్దేశ పూర్వకంగా ప్రమాణీకరించి అదే విధంగా అమలు జరపటం కర్తవ్యమని వాదిస్తున్నారు. తమిళం, జర్మన్ వంటి భాషల్లో పరిభాషను కూడా అనువదించి సృష్టించటం పరిపాటి. తెలుగు, ఇంగ్లీషు వంటి భాషల్లో భావనలతో బాటు పరిభాషను కూడా యథాతథంగా వాడుకోవటం అలవాటు. అందువల్ల నేటి తెలుగును ప్రమాణీకరించ వలసిన అవసరముంది.

ప్రామాణిక భాషకు ఆధారభూతమైన మాండలిక మేదన్న ప్రశ్న వీరేశలింగం తరువాతి కాలంలో వచ్చింది. గ్రియర్సన్, స్టైన్‌కోనౌ, ఆర్డెన్ వంటివాళ్ళు కోస్తా మాండలికమేనన్నారు. ఇప్పుడు మాండలిక సాహిత్యం భిన్న మాండలికాల్లో వస్తున్నది. అది రచయితల సృజనాత్మక శక్తి మీద ఆధారపడి ప్రాముఖ్యం సంపాదిస్తున్నది. ఇన్నాళ్ళూ కవితాభాషకూ వచన రచనా భాషకూ మధ్య చాలా అంతరం కనిపించేది. రావిశాస్త్రి మాండలిక వచనం ఆ లోపాన్ని పూరించి, ఆరెండు విధాల భాషలకూ ఏకరూపత సాధించింది. తెలుగు మాట్లాడే ప్రాంతాల న్నింటిలోని మాండలిక భాషా లక్షణాలనూ సర్వే చేసి వయో లింగ విద్యా వృత్తి భేదాదుల మధ్య గల భేదసాదృశ్యాలను సమీక్షించి, లిఖితవాగ్రూపాల్లోని సాధారణ లక్షణాలను సూత్రీక రించి, ప్రధానాపవాదాలను పేర్కొంటూ సువిస్తృత వ్యాకరణ గ్రంథ రచన చేస్తే తెలుగు భాష ప్రమాణీకృతమవుతుంది. లిఖిత వ్యాకరణం లేని భాషను ప్రమాణిక భాష అని పాశ్చాత్య విద్వాంసులు గుర్తించటం లేదు. అది వర్ణనాత్మకంగా ఉండి సాధ్యమైనంత విస్తృతంగా ఉన్నప్పుడు బహుకాలం అదే గౌరవం పొందగలదు. సర్వకాల సర్వావస్థలకూ అదే ఏకైక ప్రమాణం కాదు. ఒకే ప్రమాణం వాంఛనీయమూ కాదు. పరివర్తన శీలమైన వర్ణనాత్మక వ్యాకరణ రచనలు వెలువడ్డప్పుడుగాని ఉత్తమ చారిత్రక వ్యాకరణ రచన సాధ్యంకాదు. అటువంటిది వచ్చినప్పుడు తులనాత్మక వ్యాకరణ గ్రంథాలు ఫలవంతమవుతాయి. ఉత్తమ వ్యాకరణ రచనలూ ఉత్తమభాషా నిఘంటువులూ వెలువడ్డప్పుడు, అవి పరస్పరాధారితాలని పండితలోకం గుర్తించినప్పుడు, తెలుగు భాష ఉన్నతస్థితికి వస్తుంది. సమీప భవిష్యత్తులో అటువంటి మహత్తర ప్రయత్నాలు మొదలై నెరవేరుతాయని ఆశిద్దాం. వాటికి కావలసిన ఆర్థిక హార్దిక సహాయాలను తెలుగుజాతి అందిస్తుందని ఆశిద్దాం.

# దేవదారుల నీడల్లో

- డా. సంజీవదేవ్

భూమిమీద చెట్టుంటుంది. చెట్టు క్రింద నీడ వుంటుంది. నీడ నిరంతరం వుండదు, బయట కాంతి వున్నప్పుడు మాత్రమే వుంటుంది. ఆ కాంతి సూర్యకాంతి కావచ్చు పగటివేళ, చంద్రకాంతి కావచ్చు రాత్రివేళ, లేక ఇంకా దేని కాంతి అయినా కావచ్చు.

ఏ చెట్టునీడ అయినా కమనీయంగానే వుంటుంది, చల్లగా, నల్లగా వుంటుంది. చెట్టుకు బయట వున్న కాంతి ఎక్కువ తెల్లగా వుంటే చెట్టు క్రింది నీడ అంత ఎక్కువ నల్లగా వుంటుంది. నీడ ఎంత ఎక్కువ నల్లగా వుంటే ఆ నీడలోని జీవులకు అంత ఎక్కువ హాయిగా వుంటుంది, అంత ఎక్కువగా సేద తీరుతుంది; చూడటానికి కూడ అంత ఎక్కువ మనోజ్ఞంగా వుంటుంది.

చెట్ల రూపాన్ని అనుసరించి వాటి నీడల రూపాలు కూడ రూపొందుతాయి.

దేవదారు చెట్టు రూపం మిగతా చెట్ల రూపాలకంటే విలక్షణంగా వుంటుంది. ఇవి ఎక్కువగా హిమాలయాల్లో, ప్రత్యేకించి ఎక్కువగా పశ్చిమ హిమాలయాల్లో వుంటాయి. వాటిని గురించిన శోభ కాళిదాసుని కావ్యాల్లో ఎక్కువగా వినిపిస్తుంది.

పశ్చిమ హిమాలయాల్లోని కులూలోయ దేవదారులకు విశిష్ట ఆవాసం. అడ్డంగా వుండే శైల శ్రేణుల అడ్డ రూపాలు దేవదారుల అతి ఎత్తయిన నిలువు రూపాల వ్యతిరేకతవల్ల ఇంకా ఎక్కువ అడ్డంగా వున్నట్లు కనిపిస్తాయి. నిలువైన కోణ రూపాల్లో వున్న దేవదారులు, లోయల్లోని దేవదారులు, కొండల ఏటవాలు ప్రదేశాల్లోని దేవదారులు, కొండల పై భాగాల్లో వున్న దేవదారులు భువిని దివిని లయమయం చేస్తుంటాయి.

అప్పటికింకా హిమాచల్ ప్రదేశ్ ఏర్పడనందున కులూలోయ పంజాబ్‌లోనే వుండేది. పఠాన్ కోట నుంచి నగ్రోటా వరకు, దూరంలో హిమాచ్ఛాదిత 'ధౌలధార్' పర్వత పంక్తిని చూస్తూ, దగ్గరలోని సెలయేళ్ల సంగీతాన్ని వింటూ చిన్న ఎగుడు దిగుడు రైలు మార్గం గుండా నా పయనం. నగ్రోటా నుండి ఘాట్ రోడ్డు ప్రారంభం. ఘాట్ రోడ్డు చూడటానికి రమ్యంగానే వుంటుంది కాని శరీరానికంతగా సుఖం వుండదు.

దారిలో అక్కడక్కడ దేవదారుల సందర్శనం. సాయంత్రానికి కులూలో దిగిపోవడం. అక్కడ నుంచి కత్రాయిన్ మీదుగా మనాలీ వరకు బ్యాస్ (వ్యాస్) నదీ తీరాన దేవదారుల లావణ్యమయ ఛాయలను ఆనందిస్తూ పోవాలంటే కాలినడకే సరైన విధానం. మధ్యాహ్నానంతరం నుంచి చెట్ల నీడలు పొడవు అవుతూ ఎక్కువ అందంగా వుంటాయి మరింత ఆనందాన్ని అందిస్తూ.

దేవదార్ల నీడల్లో నిదానంగా నడక సాగింది. నీడ వున్నచోట ఎండలేదు, ఎండ వున్నచోట నీడ లేదు. ఆకాశంలో మబ్బులు క్రమ్మినపుడు నేల మీద మబ్బుల ఛాయలు తప్ప దేవదారుల ఛాయలుండవు.

---

కొంత దూరం నడచి నడచి ఒక బృహత్తర దేవదారు ఛాయలో ఒక ఉదారంగు బండపైన కూర్చున్నాను, చెంపక్రింద చేయి పెట్టుకొని కనపడినంత వరకు నిసర్గ శోభను ఆనందిస్తూ.

ఆ ప్రాంతంలో గొర్రెలను మేపుకొంటూ గద్దీలనబడే గొర్రెల కాపర్లు నిరంతరం సంచారం చేస్తూ వుంటారు. వారు మహా కష్టజీవులు. వారు ఎండలో చల్లదనాన్నీ, చలిలో వెచ్చదనాన్నీ అనుభవించటానికి అలవాటు పడి వుంటారు.

అటువంటి వారిలోని ఒక ముసలి మనిషి దేవదారు ఛాయలోని నా వద్దకు వచ్చి తన భుజం మీది నల్ల కంబళిని తీసి క్రిందపరచి కూర్చొని గుడగుడలో నిప్పు వేసి పొగ పీల్చి వదలసాగాడు మేఘవలయాల రూపంలో. పైన ఆకాశంలో ప్రకృతి నిర్మించిన మేఘాలు, క్రింద దేవదారు ఛాయలో మనిషి నిర్మించిన మేఘాలు. చుట్టుపట్ల శోభించే దృశ్య మాధురిని నిర్లక్ష్యం చేస్తూ తాను వదలుతున్న పొగను చూస్తూ, వదలక ముందున్న పొగను పీలుస్తూ ఆనందించ సాగాడు.

అతనూ నేనూ సంభాషణ ప్రారంభించాలంటే మా ఉభయుల మధ్య భాష అడ్డు పడ సాగింది. తన మాతృభాష లిపిలేని 'కులవీ'; నా మాతృభాషతెలుగు. నాకు కులవీ తెలియదు, అతనికి తెలియదు తెలుగు. మరి నేను రాహుల్ సాంకృత్యాయన్‌ను కాను తెలియని భాషలన్నిటినీ మాట్లాడటానికి! ఉత్తర భూముల ప్రతి రాష్ట్రం లోని వారికీ కొద్దో గొప్పో హిందుస్తానీ తెలిసి వుంటుంది అపభ్రంశ రూపంలో అయినా. ఆ నమ్మకంతో అతనితో నేను హిందుస్తానీలో చిన్న చిన్న మాటలతో సంభాషణ ప్రారంభించాను. సరీగా రూపొందని హిందుస్తానీలో అతను ఏదో జవాబులు చెప్ప సాగాడు. అతను ఒకటి చెపితే నేను మరొకటిగా అర్థం చేసుకుంటున్నానేమో అని అనుమానం తట్టసాగింది. అయినా, సందర్భాన్ని బట్టీ, ఎదుటివాని ముఖ భంగిమాన్ని బట్టీ కొంత కొంత అర్థం చేసుకోవచ్చు. కొన్ని భాషకతీతమైన భావాలుంటాయి. కొన్ని భావాలు భాష ద్వారా అభివ్యక్తం కానివి వుంటాయి. ఇటువంటి భాషాతీత భావాలు వ్యక్తమవుతాయి రెండువిధాల మానవుల ద్వారా; ఒకరు అద్భుత ప్రజ్ఞాశాలురు, రెండవ వారు అమాయక ఆటవికులు.

అందువల్ల ఆ గొర్రెల కాపరి భాష నాకు పూర్తిగా అవగాహన కాకపోయినప్పటికీ తాత్పర్యం అర్థం కాకపోలేదు. నా మొదటి ప్రశ్న ''నీకు పెళ్లి అయిందా?'' అని. అందుకతని ముఖంలో చిరునవ్వు వికసించింది. గుడగుడను క్రింద వుంచి అవునన్నాడు. ''భార్యలెందరు'' అనేది రెండో ప్రశ్న నాది. అందుకతను కొంత ఖంగారుపడి అన్నాడు, ''భార్య ఒక్కటి, ఆమెకు భర్తలు నలుగురు.'' ఆ జవాబు విని నేను ఆశ్చర్యపోలేదు, అటువంటి జవాబును ఆశించే నేను ఆ ప్రశ్న వేశాను.

ఇప్పటికీ కొన్ని హిమాలయ ప్రాంతాల్లో బహు భర్తృత్వం అమలులో వున్నది అరుదుగా - జౌన్‌సార్ ప్రాంతం, కులూలోయలోని కొన్ని తావులు, లద్దాఖ్ ప్రాంతం మొదలైన చోట్ల. ఈ ఆచారం వల్ల పరోక్షంగా కుటుంబ నియంత్రణ కొనసాగుతుంది. ఒక కుటుంబంలో

వున్న అన్నదమ్ములందరికీ ఒక భార్య మాత్రమే వుంటుంది. పూర్వం ద్రౌపది వలెనే.

ఇట్లాగే వచ్చీరాని భాషలో మా సంభాషణ సాగి ముగిసింది. అతను నవ్వుకుంటూ గుడగుడ నోట కరచుకొని ఆ నీడల్లో నడుస్తూ దేవదారు అరణ్యంలో అదృశ్యమై పోయినాడు. కాని దేవదారు ఛాయలు ఇంకా అదృశ్యమై పోలేదు, సూర్యుడింకా ప్రకాశిస్తూనే వున్నందున. అయితే, వున్న కొద్దీ దేవదారు ఛాయలు నలుపు తగ్గుతూ తూర్పు దిశగా పొడవు కాసాగాయి.

రంగు రంగుల ఒక అజ్ఞాత పక్షి దేవదారు ఛాయల్లో గుండా ఎగిరి పోయింది. ఇంకొంత సేపటికి దేవదారుల నీడలు సంజ చీకటిలో లీనమైపోయి దేవదారు చెట్లు మాత్రమే తమ నీడలను కోల్పోయి కనపడసాగాయి. ఆ దగ్గరలోనే వున్న ఒక పంజాబ్ ప్రొఫెసర్ కుటీరంలోకి నేను వెళ్లిపోయాను.

పడమటి కొండల్లో అంతిమ సంధ్యాకాంతి అంతరించి పోవటంతో తూరుపు కొండల్లోని చంద్రోదయం కాంతిమంతం కాజొచ్చింది. కుటీరంలో నేను తప్ప మరెవరూ లేరు. కులూ బస్తీకి పోయిన ప్రొఫెసర్ ఇంకా తిరిగి రాలేదు.

వెన్నెల ముదురుతున్న కొద్దీ తిరిగి దేవదారుల అస్పష్ట ఛాయలు, చెట్లకు పడమటి దిశగా ఏదో స్వప్న జగత్తులోలాగా పగలున్నంతగా నలుపు లేని రూపాల్లో ప్రత్యక్షం కాజొచ్చాయి.

ఎండలోని నీడలు నల్లగా సుస్పష్టంగా గోచరిస్తాయి గంభీరంగా; వెన్నెలలోని నీడలు కొంత మసకగా సగం స్పష్టంగా కనిపిస్తాయి సుకుమారంగా. చెట్లలో నుంచి దూరంగా శూన్య మైదానం వున్న చోట్లలో నుంచి గొర్రె కాపర్లు వేసుకొంటున్న చలిమంటల జ్వాలా శిఖలు అదో విధమైన రమ్య రూపాల్లో దర్శన మిస్తున్నాయి, చీకటిలోని అగ్ని జ్వాలల కంటే వెన్నెల్లోనివి కాంతి తక్కువైనా ఎక్కువ సుందరంగా గోచరిస్తాయి.

పగటి ఎండలోని దేవదారుల నీడలు గద్య రచన లాంటివి రాత్రుల వెన్నెలోనివి పద్య రచనలాంటివి. కొంత దూరం నడచాను ఒంటరిగా వెన్నెల్లోను, వెన్నెల్లోని దేవదారుల నీడల్లోను. సగం మేల్కొన్న సగం నిద్రిస్తూన్న అనుభూతి నివ్వసాగింది ఆ దృశ్యం.

అరణ్యం అంతటిలో అక్కడక్కడ గొర్రెలు, బర్రెలు, వాటిని మేపుతున్న మనుషులు, మనుషులు మండిస్తున్న చలిమంటలు పక్షుల కూతలు మొదలైనవన్నీ నిండి వుండటంతో వన్య మృగాలను గురించిన భయం లేకుండా పోయింది.

ఇంతలో కులూకు పోయిన ప్రొఫెసర్ తిరిగి వచ్చాడు. తానూ నేనూ కలసి ఆ నిశా సమయాన చలికి వణుకుతూ, దేవదారులపైన పయనించే చందమామను చూస్తూ దాని వెన్నెల్లో రమ్య రూపాల్లో పరచబడిన దేవదారుల నీడల్లో గుండా ఆయన కుటీరం వైపుకు సాగేం.



# ఎం.ఎన్. రాయ్ తత్త్వపరిశీలన

- ఏ.బి.షా

మానవేంద్రనాథ్‌రాయ్ నవ్యమానవ తత్వానికి తన ఇరవైరెండు సిద్ధాంతాలలోనూ, పిమ్మట ''వివేచన, ఉద్వేగము, విప్లవము'' అనే గ్రంథంలోనూ ప్రాతిపదికలు వేశాడు. వాటిని పరిశీలించటమే యిక్కడ ముఖ్యోద్దేశం. రాయ్ పంథాలోనూ, విలువలపట్ల గల ధోరణిలోనూ తొలి మార్క్సిస్టు దశనుండి నవ్యమానవ వాదం వరకూ నిరంతరధోరణి లేకపోలేదు. అయినా రాయ్ తాత్విక రచనలను మార్క్సిస్టు స్థాయిలో యిక్కడ పరిశీలించటం లేదు. పూర్వపు మార్క్సిస్టు రచయితలలో చాలామందికంటె రాయ్ విశిష్టుడు గావటం యీ నిరంతరతవల్లనే! సనాతన జాతీయవాదం నుండి మార్క్సిజం ద్వారా నవ్యమానవ వాదానికి రాయ్ సాగించిన యాత్రకు నిరంతరత కొంత అంతర్లీనంగా మార్గం చూపింది; ఏకత్వభావన ఏర్పరచింది. రాయ్ తాత్విక చింతన తుది రూపాన్ని అంచనా వేయటానికి ఈ పద్ధతి అవసరం. క్రమబద్ధమైన ఆలోచనకు మూలంగా మాత్రమే తత్వాన్ని భావించి, సాంకేతిక పరిశోధన చేస్తే సరిపోదు. సోక్రటీస్ ధోరణిలో వివేచనను కనుగొనే విశాల దృక్పథాన్ని అవలంబించాలి. జాన్ డ్యూయీ చెప్పినట్లు వివేచన అంటే మానవుల సమస్యలకు అన్వయించే జ్ఞానమే! అలాంటప్పుడు, తత్వాన్ని సరిగా అవగాహన చేసుకొని అంచనా వెయ్యాలంటే తాత్వికుని పద్ధతి, ఉద్దేశం తెలుసుకోటం తప్పనిసరి. సాంకేతిక తత్వానికి పరిమితమైనవారు యీ విషయాలు విస్మరించవచ్చు. తర్కం, విశ్లేషణతత్వం ప్రారంభించిన సోక్రటీస్ సులభంగా ఖైదునుండి తప్పించుకు పోవటంకంటె, విషం మ్రింగటమే మంచిదనుకున్నాడనే విషయం వీరు విస్మరిస్తున్నారు. అంటే రాయ్ తత్వపరిశీలనలో అతని సూత్రీకరణకు సంబంధించిన బలహీనతలపై నొక్కి పెట్టాలని గాని, చూసీ చూడనట్లు పోవాలనిగాని సూచించటం లేదు. రాయ్ దృష్టిలో తత్వానికి ఒక ప్రక్క ప్రకృతి సిద్ధాంతంతోనూ, మరోవైపు సామాజిక ఆచరణతోనూ సన్నిహిత సంబంధం వున్నది గనుక రెండు కోణాల్లోనూ అతని తత్వాన్ని నిశితంగా పరిశీలించటం అవసరం. రాయ్ నొక్కిచెప్పేవి భౌతిక, సామాజిక శాస్త్రాలకు సరిపోతున్నవో లేదో చూడటం విజ్ఞానపద్ధతి రీత్యా అవసరం. అదే చాలదు. రాయ్ తన తత్వంనుండి సామాజిక మార్పులకు అవసరమైన అంతర్భావనల్ని రాబట్టినందువలన సామాజిక దృక్పథంనుండే గాక, తాత్వికేతర దృక్కోణంనుండి కూడా పరిశీలన చేయాల్సి ఉంటుంది. దీనివలన కొన్ని ప్రతిపాదనలు ఏ సందర్భంలో చెప్పబడ్డాయో గ్రహించటం సాధ్యపడుతుంది. అంతేగాక, రాయ్ ఎవరి నుద్దేశించి ప్రతిపాదనలు చేశాడో దృష్టిలో పెట్టుకోటం కూడా ఉపయోగం. వీరు రెండు వర్గాలకు చెందినవారు. ఒక వర్గం భిన్నమార్గాల ననుసరించే మార్క్సిస్టులు. భారతీయ జాతీయవాదులు మరో వర్గం. సమకాలీన ప్రపంచంలో ఆదర్శ ఆలోచనాపరులు, మార్క్స్ వలె రాయ్ కూడా తత్వంతో కేవలం ప్రపంచాన్ని వ్యాఖ్యానించడంగాక, మార్పుకు ఒక పద్ధతిగా వినియోగించ దలచాడు. భావాలు ఒకసారి జనిస్తే, వాటికి ఒక తర్కం, చలనం రూపొందుతాయని గుర్తించటంలో మార్క్స్ కంటె మించిపోయాడు రాయ్. కనుక, మార్క్సిజానికి భిన్నంగా మానవుడు సృష్టించిన విప్లవ సాధనగా ఆలోచనను పరిగణించాడు రాయ్. ఆలోచన కేవలం తీరికగా, ఏకాంతంలో

పండితుడు సాధించేదని మాత్రం భావించలేదు. వృత్తిరీత్యా తాత్వికుడు అవలంబించే ధోరణిలో రాయ్ కూడా ఒక క్రమబద్ధమైన తత్వాన్ని అందించాడు. బహుశః ఆ విధంగా చూస్తే ప్లేటో, హెగెల్, మార్క్స్ సంప్రదాయంలో రాయ్ చివరివాడు కావచ్చు. అయితే, అతనికి ముందున్న తాత్వికులవలెనే రాయ్ సూత్రీకరణ కూడా కొన్ని సందర్భాలలో అస్పష్టంగా ఉన్నది గాక, తద్భిన్నమైనదేదో చెప్పినట్లనిపిస్తుంది. అలాంటి పరిస్థితులలో విమర్శకుని కార్యభారము అంత సులభం కాదు. పైగా పరిశీలించదలచిన ఆలోచనాపరుడు ఫలప్రదమైన రచనలెన్నో చేయటంలో విమర్శకుని శ్రమ మరీ జటిలమౌతుంది. రాయ్‌ని పరిశీలించటంలో యీ రెండు వాస్తవాలను దృష్టిలో పెట్టుకోటం జరిగింది.

## 2

నవ్య మానవతావాద ప్రధాన సూత్రాలను ఈ విధంగా (చాలవరకు రాయ్ మాటల్లో) పేర్కొనవచ్చు:

1. నియమక్రమంతో నడిచే ప్రకృతి ప్రాతిపదికగా వచ్చిన మానవుడు వివేచనాత్మకత స్వీయలక్షణంగా గలవాడు.

విశ్వంలోని పొందికే మానవునిలో వివేచనగా ప్రతిధ్వనిస్తుంది. వివేచన కూడా జీవలక్షణమే కనుక, యిచ్ఛకు విరుద్ధం కాదు. అందువలన, యిచ్ఛయొక్క స్వేచ్ఛను చారిత్రక నియతివాదం తొలగించటంలేదు.

2. వివేచనాత్మకతలో నైతికత కూడా యిమిడి ఉన్నది. నైతికత అంటే అంతర ప్రవృత్తికి విస్తృపమే. అంతర ప్రవృత్తి అంటే పరిసరాలను వాసనచే తెలుసుకొని, ప్రతిచర్య జరపటం. ఆంతర ప్రవృత్తిస్థాయిలో యాంత్రికంగా జరిగే జీవకార్యం కనుక అదీ వివేచనాత్మకమే.

3. పరిసరాలను ఎరిగున్న ఫలితంగా జరిగే విధానమే భావనాకరణ. కాని, భావాలు ఒక పర్యాయం రూపొందితే వాటికి తర్కం, చలనం కూడా యేర్పడుతాయి. సాంస్కృతిక నమూనాలు, నైతిక విలువలు కేవలం వ్యవస్థాపిత ఆర్థిక సంబంధాల భావాదర్శ అతీత వ్యవస్థలు కావు.

4. మానవాభ్యుదయానికి స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణలు అనేవి రెండూ ప్రాతిపదిక ప్రేరణలు. మనుగడకై సాగించే జీవపోరాటాన్ని బుద్ధి, ఉద్వేగాల ఉన్నతస్థాయిలో కొనసాగించటమే స్వేచ్ఛాపిపాస, తదనుగుణంగా వచ్చేదే సత్యాన్వేషణ.

5. బాహ్య వాస్తవికతకు అనుగుణమైనదే సత్యము. మనం పరిశీలించే విషయాన్ని గురించి కనీసం ఉజ్జాయింపు స్వరూపాన్నిస్తుంది విజ్ఞాన విషయం. కనుక, సత్యాన్ని జ్ఞానానికి వస్తువుగా వర్ణించవచ్చు.

6. జ్ఞానమంటే వాస్తవికతతో పరిచయం ఉండటమే. సత్యానికి అనుగుణంగా వాస్తవికత ఉంటుంది గనుక, సత్యంయొక్క విషయం జ్ఞానమే!

7. ఉనికిలోని భౌతిక, మానసిక, నైతిక దృక్పథాలన్నిటినీ ఒకే తత్వంలో పొందికగా యిమడ్చటానికి స్వేచ్ఛ, జ్ఞానం, సత్యం ఉపకరిస్తున్నాయి. ఇలా అన్ని కోణాలనుండి

పరిశీలియా తత్వం ద్వైత వాదాన్ని తోసిరాజంటుంది. అంతేకాదు ప్రకృతి తత్వం భౌతిక వాదంతో ఆదర్శవాదానికి పొత్తు కుదుర్చుతుంది; ప్రకృతి తత్వంలో (Naturialism) నైతిక శాస్త్రానికి చోటు చూపుతుంది. ఈ సూత్రాల అంతర్భావము లేక సహసంబంధం సామాజిక తత్వానికి ముఖ్యం. అది కూడా చాలావరకు రాయ్ మాటల్లోనే యీ విధంగా చెప్పవచ్చు.

8. సమాజానికి, రాజ్యానికి పూర్వమే వ్యక్తి ఉన్నాడు. జీవపరిణామ ప్రాతిపదికతో పరిణమించిన మానవుడు, తన పోరాటాన్ని వ్యక్తిగా ప్రారంభిస్తాడు. కాలక్రమంలో విడివిడిగా ఉన్నవ్యక్తులు కలసి కృషిచేస్తే పోరాటం యింకా జయప్రదంగా నిర్వహించగలమని గుర్తిస్తారు. అదే సమాజానికి మూలం.

9. వివేచనాత్మక మానవ ప్రయత్న ప్రయోజనం-వ్యష్టిగాగాని సమిష్టిగాగాని, నిరంతరంగా స్వేచ్ఛను పెంపొందించుకోవటమే, అన్ని ప్రతిబంధకాలను క్రమేణా పోగొట్టుకోవటమే స్వేచ్ఛ.

10. మానవుడు తన ప్రపంచానికి తానేకర్త. ఇది ఆలోచనా జీవిగా మానవునకు సంబంధించిన విషయం. వ్యక్తిగా అతను అలాగే వుండక తప్పదు. ప్రతిభ గల వ్యక్తుల భావనల ననుసరించి రూపొందిన భావచ్ఛేదనల వలననే విప్లవాలు రేకెత్తినవి.

11. వ్యక్తిస్వేచ్ఛను భంగపరచకుండా అందరి సౌభాగ్యం, అభివృద్ధి భద్రపరచాలంటే, సమాజాన్ని పునర్వ్యవస్థీకరించాలంటే, పౌరులను విద్యాధికులుగా చేయాలి.

ఈ సూత్రాలనుండి, రాయ్ చెప్పిన నిర్మాణాత్మక ప్రజాస్వామ్యం వికేంద్రీకృత ప్రణాళిక, ఉత్పత్తి సాధనగా రాజ్యాధికారంగాక సహకారంపై నొక్కు పెట్టటం అనేవి వచ్చాయి.

## 3

ఈ ప్రకటనలపై (1 నుండి 7 వరకు) వ్యాఖ్యానించేముందు, వాటిలో గల ప్రధానభావనలు చూపటం ఉపయోగకారిగా ఉంటుంది. మొదటిభావన : మానవుడి సిద్ధాంతానికి ప్రాతిపదికగా ప్రకృతిసిద్ధాంతం అవసరం. అలాంటి ప్రాతిపదిక లేకుంటే నీతి శాస్త్రానికి హేతుబద్ధమైన ఆధారం ఉండదు.

విజ్ఞానతత్వంనుండి రాబట్టని సరైన సామాజికతత్వం ఉండవీల్లేదన్నమాట. మొదటి భావనలో మరోభావన యిమిడి ఉన్నది.

రెండవ భావన : ప్రాపంచిక పరిశీలనతో క్రమపరచబడి, సూచించబడిన కొన్ని ప్రాథమిక సూత్రాలు ఆధారంగా జ్ఞానమంతా ఒకే విశ్వవిధానంగా ఏకీకరణ మొనర్చటం సాధ్యం.

మూడవ భావన మరీ ప్రత్యేకించినది. నవ్యమానవతా వాదానికేగాక, మానవాళిని పూర్తిగా పునర్నిర్మాణం చేయాలనే వారందరికీ మూడవ భావన ముఖ్యం.

మూడవ భావన : భౌతిక విజ్ఞానం ముఖ్యంగా పదార్థ విజ్ఞానంలోని నియతివాదం సామాజిక మార్పు సిద్ధాంతం నిలబడటానికి తప్పనిసరి.

ప్రస్తుతం మానవ విజ్ఞానం పెంపొందే రీతి, ఇకముందు అభివృద్ధి చెందనున్న ధోరణినిబట్టి యీ భావనల అవసరం లేదని నాకనిపిస్తున్నది. నవ్య మానవ వాదం కావాలనే విలువలు గల సామాజిక తత్వనిర్మాణానికి యీ భావన లేవీ అవసరంలేదని చూపవచ్చు.

## 4

ఇప్పుడు ఒక్కొక్క ప్రకటన పరిశీలిద్దాం. ఆదర్శవాదుల అలౌకిక వాదాన్ని, మార్క్సిస్టుల జ్ఞాతికవాదాన్ని రాయ్ నిరాకరించాడు. నైతిక విలువలతో సహా, భావాలన్నీ మానవ మెదడుకు ప్రత్యక్షమయ్యే పదార్థ వాస్తవాధారాలే తప్ప, లెనిన్ చెప్పినట్లుగా పదార్థ సత్యపు కేవల ప్రతిబింబాలుగా మెదడు గ్రహించేవి మాత్రం కాదు. అంటే వివేచన గాని నైతిక ప్రేరణ మానవునిలో 'దైవాంశాలు' కాదు అని రాయ్ ఉద్దేశం. శరీరంలో అంతర్లీనంగా జీవశక్తివంటివి ఆత్మకు చిహ్నంగా ఉన్నాయనే వాదన కూడా రాయ్ త్రోసిపుచ్చాడు. కాగా, తాము చూపే బొమ్మలకు ఆధారమైన పదార్థ సత్యాన్ని ఏవిధంగానూ ప్రభావితం చేయజాలని చలనచిత్రం వలె గాక, మానసిక ఘటనలు కేవలం ఆంతర ప్రవృత్తి స్థితి మాత్రమే కాదు. భావాలకు, సంఘటనలకు పరస్పర ప్రభావితగుణం ఉన్నది. కనుక కారణశక్తిలో ఏది ముందు అనేది కూడా నిర్ధారించజాలం.

రాయ్‌తో యీ విషయాలన్నీ ఏకీభవించినా, కొన్ని ప్రతిపాదనలు యింకా అసంతృప్తి కరంగా ఉన్నాయి. ఉదాహరణకు మానవ వివేచనకు సంబంధించిన మొదటి ప్రకటన చూద్దాం. మానవునిలోని వివేచన జీవలక్షణంగా పుణికిపుచ్చుకున్నాడనటంలో స్పష్టత లేదు. ఇక్కడ చాలాచిక్కులు ఉన్నవి. ప్రకృతి నియమ నిబద్ధమని భావించడం ఒకటి. అంటే కాలంరీత్యా, భవిష్యత్తులోనూ, గతంలోనూ హద్దులు లేని అంచనా సాధ్యమన్నమాట. 'నియమ బద్ధత' అంటే ప్రతి సంఘటననూ పూర్వకారణంతోనూ, యిదమిత్థమైన నియమాల వలననూ వివరించవచ్చునని అర్థం చెప్పుకున్నా, యింకా అనేక సమస్యలు ఉంటవి. 'వివేచన'ను మానవునికి అన్వయించినప్పుడు ఆ లక్షణం ఉన్నదని, అది ఉపయోగించే శక్తిగలదని, అనుభవంనుండి గ్రహించేశక్తి ఉన్నదని, మార్గాలకు లక్ష్యాలకు సంబంధం సమకూర్చుతుందని, కార్య-కారణ లేక ప్రతిపాదన-నిర్ణయ సంబంధాలదృష్ట్యా ఆలోచించటమని సంక్షిప్తంగా చెప్పాలంటే-మననశీల ఆలోచనాశక్తిగలదని చెప్పవచ్చు. ఇదే ప్రకృతి పరంగా అన్వయిస్తే, వివేచన అంటే మానవ వివేచనకు అవగాహన అయ్యేదని; గతం, వర్తమాన పరిశీలనాధారంగా భవిష్యత్తులో సంఘటనల్ని అంచనావేయుటంతోసహా, క్రమవర్ణనకు అవకాశం యిచ్చే నియమాలకు అనుగుణంగా ఉండేదని పేర్కొనవచ్చు. 'వివేచన'కు యిక్కడ సూచించిన అర్థాల్ని ''ప్ర(వి)'' (ప్రకృతి పరంగా) ''ప్ర(మా)'' (మానవపరంగా) అనే సంకేతాలతో చూద్దాం. ఇప్పుడు మనం పరిశీలించే సిద్ధాంతానుసారం ''ప్ర(మా)'' అంటే ''ప్ర(వి)'' యిమిడి ఉన్నదన్న మాట. ప్రకృతికి ''ప్ర(మా)'' లక్షణం ఉన్నది గనుక, ప్రకృతి ప్రాతిపదికగా మానవుడు పరిణమించాడు గనుక, అతనిలోనూ ''ప్ర(మా)'' లక్షణం ఉన్నదనేటంతవరకు చెబితే చెప్పొచ్చు. మానవునిలో ''ప్ర(వి)'' లక్షణం ఉన్నదనేది వేరే రుజువు పరచాలి. లేదా ప్రతిపాదించాలి. మానవునిలో ''ప్ర(మా)'' లక్షణం యిందువలన ప్రభావితం కాదు.

మానవుడు ప్రకృతి ప్రతినిధిగానేగాక పరిశీలనాత్మక వస్తువుగా (ఒక మనిషిని యితరులు పరిశీలించే రీతిలో) ఉండటం సాధ్యంగనుక, మానవతలో విభాగమైన ఆలోచన తప్పనిసరిగా వివేచనతో కూడినదై ఉండాలని వాదించవచ్చు. అంటే ప్రకృతి ప్రతినిధిగా మానవునిలో, ''ప్ర(వి)'' లక్షణాన్ని, పరిశీలనాత్మక వస్తువుగా గల మానవుడి వివేచన లక్షణం ''ప్ర(మా)'' ఆధారంగా రాబట్టవచ్చునని అర్థం. అయితే మరొక కష్టం ఎదుర్కొనవలసి వస్తుంది.

మానవునిలో ''ప్ర(మా)'' లక్షణం అతనిలో ''ప్ర(వి)'' లక్షణానికి ఆధారమైతే, యితర జీవులన్నిటా ''ప్ర(వి)'' లక్షణరీత్యా వివేచనాత్మక ఆలోచన ఉండవాలి. అయితే ''ప్ర(మా)'' లక్షణంలో గర్భితంగా ''ప్ర(వి)'' లక్షణం యిమిడిఉన్నదని, ప్రకృతి ప్రతినిధు లుగా మానవునికీ యితర జీవాలకూ తేడా స్థాయిలో మాత్రమే అని వాదించి, గట్టెక్కవచ్చు. అది విపరీత సమాధానం అవుతుంది. అలాంటప్పుడు, మానవుడికి గాని, అమీబాకుగాని, జీవాలన్నిటికీ సంబంధించిన స్వీయలక్షణం ఉన్నదా అనే ప్రశ్న జనిస్తుంది. ఉన్నదంటే, కొత్త లక్షణాలు ఆవిర్భవించే అవకాశాన్ని తృణీకరించినట్లే!

ఇక్కడ ఇంకా ముఖ్యమైన జటిలత్వం ఉన్నది. పరిశీలక వస్తువుగా మానవునిలోని ''ప్ర(మా)'' అనే వివేచన లక్షణం అంగీకరించటానికి కారణం ప్రకృతిలో ఆ లక్షణం ఉన్నందుననేగదా? అయితే మానవుడు యించుమించు చాలా విషయాలలో ప్రకృతికి భిన్నంగా ఉన్నందున ప్రకృతిలో లక్షణం ప్రకృతి నుండి వచ్చిన ప్రతిదానిలోనూ తప్పనిసరిగా ఉండాలనడం ఎలా సాధ్యం? రాయ్ సిద్ధాంతానుసారం జీవ నియమాలు ప్రకృతినియమాలలో యిమిడి ఉన్నవి. అంటే యీ నియమాలకు అలౌకిక ఆధారం లేదనేటంతవరకే, పరిమితా ర్థంలో రాయ్ చెప్పేది సరిపోతుంది. ఇంతకుమించిన విస్తృతార్థం రాయ్ దృష్టిలో లేదు, సరికాదు గూడా. అంటే ప్రకృతి నియమాల ఆధారంగా జీవ ప్రవర్తన ముందే చూడగలగటం సాధ్య పడదు. పరిణామపు మలుపుల్లో కొన్ని కొత్తలక్షణాలు ఆవిర్భవిస్తున్నవి. పూర్వస్థితి ఆధారంగా యీ కొత్త లక్షణాలను ముందుగా ఊహించటం సాధ్యం కాదు.

వివేచననుండి నైతిక ప్రేరణను రాబట్టిన రాయ్ తీరు కూడా తీవ్ర లోపాలున్న వాదనే. చైతన్యస్థాయిలోనైనా సరే ఆంతర ప్రవృత్తిని యాంత్రిక జీవవిధానంగా పేర్కొనటమంటే - చైతన్యంలో ఒకానొక స్థాయికి చేరిన జీవులలోని ఆంతర ప్రవృత్తి అన్ని దశల్లోనూ ఒకటేనన్నమాట. ఎందుకంటే, ఒకానొక జీవజాతిలో ప్రేరణలు, ఉద్దీపనలకు ప్రతిచర్యలు, తదితర యాంత్రిక జీవచర్యలన్నీ ఒకవిధంగానే ఉంటాయి. అలాగైతే, రాయ్ సిద్ధాంతం ప్రకారం, ప్రాక్పశ్చిమాలలో ఆదిమ, పూర్వ మధ్యమ, ఆధునిక మానవు లందరిలో ఒకే నైతికభావన ఉండాలి. సాంస్కృతిక వికాసాలతో పనిలేదు. వాస్తవానికి ఇది సరికాదు.

చైతన్యస్థాయిలో అంతరప్రవృత్తిని యాంత్రిక జీవవిధానంగా అంగీకరించినా, నైతికత వివేచనాత్మక మనేది కుదరదు. ప్ర(వి)లక్షణం ప్రకారం వివేచనలలో నైతికత యిమిడి వుంటుందనేది కూడా రాబట్ట వీల్లేదు. వివేచనవలన నైతికత అవగాహన అవుతుంది అంటే అర్థం స్పష్టంగా ఉంటుంది. ఇతర విలువలవలె నైతిక విలువ పాటించటానికి వివేచన చాలా ఉపకరిస్తుందనేది వాస్తవం; అంతేగాని, నైతికతకు వివేచనకు కార్యకారణ సంబంధం చెప్పటం మాత్రం ప్రశ్నించదగిందే.

విలువలు వాస్తవాలంటాడు రాయ్. తద్వారా కొన్ని ప్రాథమిక నైతిక విలువల విశ్వజనీన తను వివరించటానికి, వాటిని తప్పనిసరిగా అనుసరించవలసిన స్వభావాన్ని సూచించటానికి రాయ్ యిలా చెప్పాడు. కాని యీ విధంగా ప్రవచించటంలో పాటించవలసినదానికీ ఉన్నదానికీ గల తార్కిక అఖాతాన్ని విస్మరించాడు.

నైతిక విలువలకు విజ్ఞానాధారం సమకూర్చాలని రాయ్ చేసిన ప్రయత్నంవలన యీ గందరగోళం వచ్చిందనేది అవగాహన చేసుకోవాలి. అలౌకిక వాదానికి చారిత్రక నియతి వాదాన్ని తృణీకరించాడు రాయ్. మార్క్సిస్టుల దృష్టిలో నీతి అనేది దైవాంశం. వీరిరువురి దృష్ట్యా విలువలకు ఆధారం వ్యక్తికి సంబంధంలేని బాహ్యవిషయాలు. మార్క్సిస్టుల దృష్టిలో వ్యక్తి చరిత్ర ఆటవస్తువు మాత్రమే. ఆదర్శవాదుల రీత్యా వ్యక్తి యితర జంతువులవలె ఒక మట్టిముద్ద మాత్రమే. ఈ యిరు వర్గాలను రాయ్ తృణీకరించాడు. అంతేగాని వైజ్ఞానిక దృష్టిని ఆకళింపు చేసుకున్నవారి నుద్దేశించలేదు. మానవ వివేచన విషయంలోవలె ఇక్కడ కూడా అవసరమైన దానికంటె అధికంగా రుజువు చెయ్యదలచాడు రాయ్.

సత్యమంటే వాస్తవంతో సంబంధం గలదని, కనుక జ్ఞానానికి వస్తువు సత్యమని రాయ్ సిద్ధాంతం.

అధిభౌతిక సత్యానికి లేక దివ్యదర్శనం ద్వారా తెలుసుకున్నామనే సత్యానికి విరుద్ధంగా విజ్ఞానదృష్ట్యా సత్యాన్ని రాయ్ పేర్కొంటున్నాడని విస్మరిస్తే, ఇదేదో అతి సామాన్యంగా గోచరించే అవకాశం ఉన్నది. ఆత్మాశ్రయంగానూ, అలౌకికంగానూ చెప్పే సత్యమంతా కేవలం మాటలేనని, వాస్తవాన్ని అర్థం చేసుకోవాలన్నా, బహిరంగంగా రుజువు పరచాలన్నా విజ్ఞానం మాత్రమే తోడ్పడుతుందని రాయ్ ఉద్దేశం. ఇంగితజ్ఞానం దృష్ట్యా యీ విషయంలో రాయ్‌తో ఏకీభవించవచ్చు. కాని యీ ప్రతిపాదన యింకా నిర్దుష్టంగా ఉండాల్సింది. ఉదాహరణకు : ప్రతిపాదనల లక్షణంగా సత్యాన్ని నిర్వచింపవచ్చు. ప్రతిపాదనలో విషయాన్ని రుజువుపరచే వాస్తవం ఉంటే అది సరైనది అవుతుంది. లేక, రుజువుపరచ గలిగిన ప్రతిపాదనలనుండి రాబట్టిన విషయం కూడా సత్యం గావచ్చు. సరైనవని భావించబడిన వాస్తవ ప్రతిపాదనల విషయమే జ్ఞానం.

కనుక జ్ఞానంకంటె సత్యం విస్తృత భావన. సత్యాన్ని వాస్తవ దృక్పథంతో చెప్పాలంటే: వాస్తవాలున్నవి. వాస్తవాలు సరైనవో కాదో చెప్పే వాక్యా లున్నవి. అంటే వాస్తవాలకు సంబంధించిన వాక్యాలున్నాయన్నమాట. తద్భిన్నంగా నిర్ధారించే స్వతంత్ర పద్ధతి ఏదీ లేదు. వాస్తవమైన ప్రతిపాదన భావించటం సాధ్యం. అది ఇంతవరకూ మరెవరికీ తెలియని ప్రతిపాదన కావచ్చు. అలాంటప్పుడు ఆ ప్రతిపాదనలోని సత్యం జ్ఞానవిషయమెలా అవుతుంది?

## 5

ఇలాంటి విమర్శను రాయ్ ఆహ్వానించి, అంతా కాకపోయినా, చాలా భాగం తన తాత్విక సూత్రాలను మార్చేవాడని స్వానుభవంతో అనుకుంటున్నాను. రాయ్ తన భావాలకై తీవ్రంగా పోరాడినా అందులో అతనికి స్వార్థం లేదు. కనుక తనకు యిష్టమైన సిద్ధాంతాలను సమర్థించుకునేటప్పుడు కూడా విశాల దృక్పథంతో ఉండేవాడు. విజ్ఞానాన్ని ఒకానొక రీతిలో వ్యాఖ్యానించాలని గాక, అదొక పద్ధతిగా, ఉదారమైన విలువగా మాత్రమే స్వీకరించాడు

సోక్రటీస్. డ్యూయి, కాసైరర్ కోవలో రాయ్ కూడా తత్వానికి ఎనలేని ఆచరణ వున్నదని భావించాడు. అందుకే, తొలి తాత్విక మూస విధానాలతో నిరుత్సాహం చెంది, అయిష్టంగానే తానూ ఒక మూస విధానాన్ని రూపొందించాడు. ఈ శతాబ్దారంభంలో బెంగాల్‌లోనూ, ఉత్తరోత్తరా మెక్సికో, కమ్యూనిస్టు రష్యాలోనూగాక, ఉదార, నిశిత విమర్శక మేధావుల మధ్య ఉన్నట్లయితే ఇంకా అధునాతనంగానూ, నిర్దుష్టంగానూ, ప్రకృతి తత్వాన్ని పెంపొందించేవాడు. సామాజిక మార్పుకు విజ్ఞాన సిద్ధాంతాన్ని రూపొందించేవాడు. ఆ పని చేయటానికి వీలుగా ఇతరులకు మార్గం సుకరంచేశాడు రాయ్. భారతీయ తాత్వికవాతావరణంలో రాయ్ సాధించిన దాన్నుండి ఎంతమాత్రం దృష్టి మరలించకూడదు.

ఈ క్రింద కొన్ని సిద్ధాంతాలు ప్రతిపాదించ బడినవి. అవి నవ్యమానవవాద విలువలకు చెందినవి. నాకు అవగాహన అయినంతవరకూ యివి ఆధునిక విజ్ఞానంతో పొందికగా ఉన్నాయి. రాయ్ సిద్ధాంతాలకు మారుగా వేరే చెప్పటం ఇక్కడ ప్రధానోద్దేశం కాదు. కాని రాయ్ తత్వంలో ఆధునిక విజ్ఞానంతో సరిపోయే వాటిని పునర్వ్యవస్థీకరించే ప్రయత్నమే యిది. రాయ్ కూడా విజ్ఞానంపైనే ఆధారపడినాడు. ఆ దృష్టితోనే రాయ్ ధోరణిలో ప్రత్యామ్నాయ సిద్ధాంతాలు సూచించబడినవి.

## ప్రత్యామ్నాయ సిద్ధాంతాలు :

**1.** నియమబద్ధంగా నడిచే స్వలక్షణంగలదిగా భావించబడే భౌతిక ప్రకృతి భూమికగా పరిణమించిన మానవుడిని హేతుబద్ధంగా వివరించవచ్చు. తెలుసుకోవాలనే ఆకాంక్ష, ఆలోచనాశక్తి, రమణీయతను, మంచితనాన్ని ప్రేమించే రీతి, సృజనాత్మకత, ఆదర్శవాదం, క్రూరత్వం, స్వార్థం వంటి విశిష్ట మానవ లక్షణాలన్నీ అతని జీవ పారంపర్యతనుండి, భౌతిక, సాంస్కృతిక పరిసరాలనుండి గ్రహించవచ్చు. వాటికి అలౌకిక, దైవిక, పారమార్థిక ఆధారాల అవసరం లేదు.

**2.** మానవ పురోగమనానికి స్వేచ్ఛాపిపాస ప్రాథమిక తృష్ణగా ఉన్నది. మేధ, ఉద్వేగ స్థాయిల్లో యీ స్వేచ్ఛాపిపాస అనేది ఉనికి పోరాటాన్ని కొనసాగించటమే. తెగనుండి వ్యక్తిగా ఆవిర్భవించటానికి యీ పిపాసలే కారణం. సత్యాన్వేషణ యిందులో భాగం, జ్ఞానం వలన పరిసరాలపై అదుపు క్రమేణా రావటంతో స్వేచ్ఛవికసిస్తుంది.

**3.** భౌతిక, సామాజిక, సాంస్కృతిక అవరోధా లన్నీ క్రమేణా తొలగి పోవటమే స్వేచ్ఛ. మానవుడుగా అతని వ్యక్తిత్వ ప్రతిభలు బహిర్గతమై, యాంత్రిక సామాజిక విధానంలో మేకువలె గాక వ్యక్తిగా మనుతాడు. కనుక స్వేచ్ఛను పెంపొందించుకొంటూ పోవటమే మానవ ప్రయత్నాలలో ఉన్నతోన్నత కృషి.

**4.** నియతివాదం స్వేచ్ఛను త్రోసివేయదు. చరిత్రలో మానవేచ్ఛ చాలా శక్తిమంత మైన నియతి విషయం. మానవ విషయాలలో శాస్త్రీయ నియతివాదభావన పరిసరాలకు మానవునకుగల పరస్పర సంబంధాలను గ్రహిస్తుంది. మానవుడు తాను మారటంలోనూ, తన పరిసరాల్ని మార్చటంలోనూ అతని యిచ్ఛ, వివేచన ఆధారంగా నిర్వహించే పాత్రను గూడా గణనలోకి తీసుకుంటుంది. మతపరమైన ప్రయోజనలేక కర్మవాదానికి యీ నియతివాదంభిన్నం.

5. కాలదోషం పట్టిన 19వ శతాబ్దపు భౌతికవాదం చేసిన తప్పుడు వ్యాఖ్యానం ఆధారంగా చరిత్రయొక్క ఆర్థిక విషయం రాబట్టారు. చరిత్ర నియతి విధానమే అయితే ఇందులో ఒకటికి మించిన కారణాలు ఉన్నవి. అందులో మానవేచ్ఛ ఒకటి. దానికి పదార్థపరమైన ఉత్సుకత ఉందని అన్ని పర్యాయాల్లోనూ చెప్ప వీల్లేదు.

6. పరిసరాలను ఎరిగున్న ఫలితంగా జరిగే శారీరక విధానమే భావాలు కలగటం. అంతే, - ఒకసారి అవి రూపొందితే, వాటి విషయాలను అనుసరించే రీతిలో స్వయంప్రతిపత్తిని సాధించుకుంటాయి. సామాజిక పరిణామ విధానానికి సమాంతరంగా భావచైతన్యత గమిస్తుంది. ఒకదానిపై మరొకటి వాటి ధోరణిలో ప్రభావం చూపుతవి. అయితే చారిత్రక సంఘటనలకూ భావాల చలనానికీ ప్రత్యక్ష కార్యకారణ సంబంధం చూపటం, సమైక్య మానవ పరిణామ దశల్లో ఏ ప్రత్యేక సంఘటనలోనూ సాధ్యం కాదు. సాంస్కృతిక రీతులు, నైతిక విలువలు అనేవి వ్యవస్థాపిత ఆర్థిక సంబంధాల ఆదర్శ నిర్మాణా లనటానికి కేవలం వీల్లేదు. అవీ చారిత్రకంగా నిర్ధారితాలే. అయితే భావాల చరిత్రలోని తర్కం ఆ నిర్ధారణకు కారణం.

7. సమాజానికి కొలమానం మానవుడు, సమాజ పురోగతికి కొలబద్ద వ్యక్తి వికాసం, స్వేచ్ఛ, సంక్షేమాలు వాస్తవాలైతే, వ్యక్తి వాటిని అనుభవిస్తాడు, మానవ సమూహాలకు సమష్టిత్వాన్ని అంటగట్టటం దోషం, విజ్ఞానం సమష్టిత్వాన్ని అంగీకరించదు. నైతిక శాస్త్రరీత్యానూ అది అవసరం లేదు. సమష్టిత్వం అంటే నైరూప్య సామూహికత్వానికి వ్యక్తి బలిగావటమే కనుక ప్రపంచాన్ని స్వేచ్ఛాపరులతో కూడిన సహకార కామన్వెల్తుగా పునర్వ్యవస్థీకరించి, అందరి లక్ష్యాలను సాధించాలని నవ్య మానవవాదం ఆశిస్తుంది.

8. నూతన స్వేచ్ఛా ప్రపంచాన్ని సృష్టించటానికి సమాజాన్ని కేవలం ఆర్థికంగా పునర్నిర్మాణం చేయటానికి అధిగమించిపోవాలి. అణగారిన, దోపిడీ చేయబడిన వర్గాల పేరిట రాజకీయాధికారాన్ని స్వాధీనం చేసుకొనటం, ఉత్పత్తి సాధనంగా వ్యక్తిగత ఆస్తుల్ని రద్దుగావించటంతోనే తప్పనిసరిగా స్వేచ్ఛరాదు.

పరిశీలక విషయాలు :

1. These theses appear in M.N.Roy, New Humanism, Renaissance Publishers, Calcutta 1948 pp 51-59.

2. M.N. Raoy, Reason, Romanticism and Revolution (2 Vols.), Renaissance Publishers, Calcutta 1953, 1955)

3. Roy's published works include nearly fifty books and eighty tracts in Spanish, German, Russian, French and English. There are about two thousand pages of unpublished writing in the M.N.Roy archives.

4. Cf. New Humanism and Reason, Romanticism and Revolution, Vol.II, ch. 12.

5. Bertrand Russel, An Inquiry into Meaning and Truth, George Allen & Unwin, London 1940, pp. 245-46.

వ్యక్తిత్వ వికాసం నుండి

# సామాజిక నైపుణ్యాన్ని పెంపొందించుకోవడానికి నిరంతరం ప్రయత్నించాలి

- సి. నరసింహారావు

మిమ్మల్ని మీరు, సవ్యంగా వ్యక్తీకరించుకోక పోవడం వలన, మీ గురించి తెలియజేయక పోవడం వలన ఇతరులు మీకు దూరంగా తొలగిపోవచ్చు. మిమ్మల్ని గురించి మీరు నిరంతరం ఏకరవు పెడుతూ, ఇతరుల మద్దతును, సానుభూతిని, పొందగోరుతుంటే, ఈ భారాన్ని భరించలేక, వారు దూరం కావచ్చు. అవకాశం లభించినప్పుడు, మిమ్మల్ని గురించి తెలియజేయడం, సందర్భోచితంగా మీ విషయాలను, ఇతరులకు చెప్పడం వలన మాత్రమే మీరంటే ఇతరులు ఇష్టపడతారు.

ఎదుటి వ్యక్తి రాజకీయాల గురించి అనర్గళంగా మాట్లాడుతుంటాడు. అతను చెప్పే విషయాలతో మీరు ఏకీభవించలేరు. కాని ఆ విషయం బయటకు చెబితే, ఏం కొంప మునుగుతుందోనని భయపడుతూ, మీరు, మౌనంగా కూర్చోనవసరం లేదు. అవకాశం వచ్చినప్పుడు, మీ అభిప్రాయాన్ని, దృఢంగా చెప్పవచ్చు. అదే సమయంలో, ఎదుటివారు చెప్పే వాటిలో, మీరు ఏకీభవించే అంశాలేమిటో గమనించాలి. వాటికి సంబంధించి మీ అభిప్రాయం కూడా, అదేనని తెలియపరచాలి.

## సామాజిక నైపుణ్యాన్ని పెంపొందించుకోవడానికి నిరంతరం ప్రయత్నించాలి

బిడియస్తులు పదిమంది మధ్యకు వెళ్ళడానికి, తమ సామాజిక నైపుణ్యాన్ని నిరూపించుకోవడానికి, పెద్దగా ప్రయత్నించరు. ఒకవేళ తప్పక వెళ్ళినా, ఇతరులతో కలవడాన్ని, ఒక విజయవంతమైన అనుభవంగా మార్చుకోవడానికి ప్రయత్నించరు. ఇతరులను కలవడం, ఒక అహ్లాదకర అనుభవంగా రూపొందించుకో దలచినప్పుడు, మీరు, మరింత చురుకుదనాన్ని కనపరచాలి. అందుకై కృషి చేయాలి. మీరు, ఇతరుల మధ్య ఎలా మెలగాలన్నది, స్పష్టంగా, ముందే నిర్ణయించుకోవాలి. ముందుగా, ఇతరులతో వ్యవహరించగల మీ సామర్థ్యాన్ని, సవ్యంగా అంచనా వేసుకోగలగాలి. మర్యాద పూర్వకంగా పలుకరించడం వరకు మాత్రమే, మీ సామర్థ్యమనుకొంటే, ఇతరులను కలసినప్పుడు, అలా పలుకరించి పూరుకోండి. తరువాత, ఏ ఒక్క వ్యక్తితోనో సంభాషించడం, అలవరచుకోండి. ఆపైన ఇద్దరు ముగ్గురితో సంభాషించండి. ఇలా క్రమంగా, రోజు రోజుకు, మీ సామాజిక నైపుణ్యాన్ని విస్తృతపరచుకోండి.

## చొరవ తీసుకో కల్గినప్పుడు మాత్రమే భయాలను తొలగదీసుకో కల్గుతారు

కొత్త వ్యక్తులను కలవడం, తమకు, భయంగా, అసౌఖ్యంగా అనిపిస్తుందని బిడియస్తులు భావిస్తుంటారు. తమను వేధించే సమస్యలన్నింటినీ అధిగమించి, జీవితంలో స్థిరపడిన తరువాత

మాత్రమే, ఇతరులతో సంబంధాలు నెలకొల్పుకోవచ్చని, మీరు అనుకొంటుంటారు. ఇదంతా, తమ అసమర్థతను కప్పి పుచ్చుకోవడం మాత్రమే! ఇతరులతో కలవడం, కొత్తలో, అసౌఖ్యంగా అనిపించ వచ్చు. ఇలా అసౌఖ్యంగా అనిపించడం, మీరు ఆ భావనను అధిగమించడానికి దోహదం చేస్తుంది. మీ మనస్సులో భయాలు, అనుమానాలు, ఎన్ని వున్నా, ఇతరులను కలిసే చొరవ తీసుకోగలిగినప్పుడు మాత్రమే మీరు, వాటిని అధిగమించ గలుగుతారు.

ఇతరులను కలిసే సందర్భంలో, మీరు, లేనిపోని గొప్పలు ప్రదర్శించడానికి పూనుకోవద్దు. మీరు కలిసే వ్యక్తులందరికంటే, మీరు, గొప్పగా కనిపించాలన్న ఆలోచనకు, స్వస్తి చెప్పండి. ఇతరులతో పోల్చుకొని మీ గొప్పదనాన్ని, ప్రయోజకత్వాన్ని నిరూపించుకోవాలని మీరు ప్రయత్నిస్తుంటే , అవెన్నటికీ నిరూపితం కావని గుర్తించండి. అలాగే, మీరు, ఇతరులందరికంటే తక్కువవారని భయపడనవసరం లేదు. మీరు నిశితంగా పరిశీలించగలిగితే, మీ చుట్టూ వున్న వ్యక్తులందరూ, కేవలం మీ వంటివారేనని గ్రహించగలుగుతారు.

ఇతరులందరూ, నిరంతరం, మిమ్మల్ని నిశితంగా పరిశీలిస్తూ మిమ్మల్ని ఎప్పటికప్పుడు అంచనా కడుతుంటారని, మీ తప్పుల్ని ఎత్తి చూపడానికి, మిమ్మల్ని అవమానించడానికి, ప్రయత్నిస్తుంటారని వారికి ఇంకో పని లేదనీ, అనుకోవడం పూర్తిగా పొరపాటు. ఇతరులు, తమను తప్పుగా అర్థం చేసుకొని, తక్కువగా అంచనా వేస్తారేమోనని, భయపడే బిడియపడే బిడియస్తులు మాత్రమే, నిరంతరం ఇలా మధనపడుతుంటారు. మీకు తటస్థపడిన ప్రతి ఒక్కరినీ, ఇలా అంచనా వేస్తుంటారు గనుక, మిమ్మల్ని సైతం, వారు, అలా అంచనా వేస్తారని భయపడుతుంటారు. మీరు, ఇతరులందరినీ అంచనా వేయడం మానిసేస్తే, ఇతరులు, మిమ్మల్ని, ఎలా అంచనా వేస్తున్నారోనన్న అనుమానం మీకు కలుగబోదు. అలాగే, మిమ్మల్ని తప్పుగా అంచనా వేయబోయే వ్యక్తులందరూ, మీరు అధికులేమోనని మనస్సులో భయపడుతుంటారని గుర్తించండి.

## గతంలో ఎదురైన అనుభవాలే పునరావృత్తం అవుతాయనుకోవద్దు

వందలాది మందితో పరిచయాలు ఏర్పరచుకోగలిగి, అందరికీ సదభిప్రాయాన్ని కలిగించ గలిగిన వ్యక్తులు సైతం, కొన్ని కొన్ని సందర్భాలలో, అపజయాలను, పరాభవాలను ఎదుర్కోవచ్చు. కాని వారికున్న ఆత్మవిశ్వాసం కారణంగా వీటిని తలచుకొని వారు బెదిరిపోరు. ఒక సందర్భంలో, మనం ఆశించినట్లు జరగనంతటి మాత్రాన, ప్రతి సందర్భంలోనూ అదే అనుభవం పునరావృత్తం అవుతుందను కోవడం తప్పు. కొద్దిమంది వ్యక్తులతో, మీకు గతంలో చేకూరిన అనుభవాలను దృష్టిలో వుంచుకొని, ఇతరులెవరితోనైనా, అలాగే వైఫల్యాలు ఎదురవుతాయని, నిర్ణయించేసుకోవడం పొరపాటు. మీ పరిచయ స్థులలో కొందరెవరైనా, నిరంతరం నిరాశాపూరితమైన దృక్పథంతో, ఇతరుల లోపాలెంచడమే తమప నిగా పెట్టుకొంటే, వారికి మీపై సదభిప్రాయం కలిగేలా ప్రవర్తించాలని, అనుకోవద్దు.

ఇతరులను కలసినప్పుడు ఎలా ప్రవర్తించాలో, మీకింతకుముందే అలవాటయిపోయింది. ఆ ప్రవర్తన వలన మీకు ఎక్కువ సందర్భాలలో వైఫల్యాలే ఎదురయ్యాయి. మీరు ఇప్పుడు కూడా ఆ ప్రవర్తననే పునరావృత్తం చేస్తే, తిరిగి వైఫల్యాలు సైతం పునరావృత్తమే అవుతాయి. ఇలా కాకుండా, మీరు కొత్త రీతిలో ప్రవర్తించ సమకట్టినప్పుడే, మీకు అభినందనలు లభ్యమవుతాయి. మీ ఆత్మ విశ్వాసం ఇనుమడిస్తుంది. మీకు, పరిచయమైన సన్నివేశాలే కాదు, అంతకంటే క్లిష్టమైన సందర్భాలలో పాల్గొనడం ద్వారా, మీ ఆత్మ విశ్వాసం ఎంతగానో పెంపొందుతుంది. ''నేను చాల గొప్పవాడిని. ఇతరులంతా నా గొప్పదనాన్ని సవ్యంగా అర్థం చేసుకొంటే, వారే నా చుట్టూ గుమిగూడతారు. నా అంతట నేను ప్రయత్నించడం, వృధా ప్రయాసే'' అని భావించే బిడియస్తులు తమ ప్రతిభను, నైపుణ్యాన్ని, కనపరిచే

కృషి చేయరు. పైగా అందరిలోనూ లోపాలెంచడం, పొగరుబోతుగా వ్యవహరించడం, అబద్ధాలాడడం వీరికి అలవాటు అవుతుంది. తనను గురించి అతి తక్కువ అంచనా వేసుకొనే వ్యక్తి, తానెటువంటి ప్రయత్నం చేసినా ప్రయోజనమేమీ వుండదనుకొంటూ, అసలు ప్రయత్నమే చేయబోడు.

## ఇతరులతో కలవడాన్ని యాంత్రికమైన సంఘటనగా మార్చవద్దు

మీరొక సమావేశానికి, లేదా హోటలుకు, లేదా పెళ్ళికి వెళతారు. అక్కడ కొత్త వ్యక్తులు మీరు పరిచయం అవుతారు. మీరు ఒక అరనిముషం ఒక కొత్త వ్యక్తితో గడుపుతారు. అతనికి షేక్‌హాండ్ ఇస్తారు. అతని కళ్ళలోకి చూస్తారు. మీ పేరు తెలియజేసి, అతనికి అభినందనలు తెలియజేస్తారు. మీరింతవరకూ, ఈ పనులెలా చేస్తున్నారో, ఒక్కసారి ఆలోచించండి. చాలమంది తమ పేరుగాని, 'గ్లాడ్ టు సీయూ' అని గాని, స్పష్టంగా చెప్పకుండా, ఏదో గొణిగినట్లు అంటారు. అలాగే, ఎదుటి వ్యక్తి కళ్ళల్లోకి సూటిగా చూడరు. షేక్‌హాండ్ కూడా, అంటీ అంటనట్లు ఇస్తారు. మీరు ఈ కోవకు చెందిన వ్యక్తులయితే, దృఢమైన షేక్‌హాండ్ ఇవ్వండి. ఎదుటివ్యక్తి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ, అతని ముఖాన్ని, స్పష్టంగా పరిశీలించండి. అలాగే స్పష్టంగా వినిపించకపోయినా, వినపడినట్లు నటించవద్దు. పేరు అడిగి తెలుసుకోండి.

మీరు చదువుకొనే కాలేజీలోగాని, ఉద్యోగం చేసే కార్యాలయంలోగాని, మీకు ప్రతిరోజూ తటస్థపడే వ్యక్తులు కొందరుంటారు. వారిలో ఒక పదిమంది పేర్లు మీ నోట్‌బుక్‌లో వ్రాసుకోండి. రోజూ వారిని కలుస్తుంటారే తప్ప, మీరు పలుకరించరు. వారిలో అయిదుగురిని కలుసుకొని పలుకరించాలని నిర్ణయించుకోండి. మరునటిరోజు ఇంకో అయిదుగురిని పలుకరించండి. ఒక్కొక్కరితో ఒక్కొక్క నిముషం గడపండి. ఆ తరువాత, వారిలో ఎవరి దగ్గరయినా ఇరవై రూపాయిలకో, యాభై రూపాయిలకో చిల్లర వుందేమో అడిగి తీసుకోండి. టైమెంతయిందో కనుక్కోండి. పెన్నొకసారి కావాలని అడిగి తీసుకోండి.

అలాగే మీరొక షాపులోకి వెళ్ళి, అక్కడ వుండే వస్తువులలో దేన్ని గురించి అయినా, అక్కడి సేల్స్‌మన్‌తోనో, సేల్స్‌గర్ల్‌తోనో మాట్లాడండి. అలాగే, ఇతర వివరాలను గురించి, ఓ పది నిముషాలపాటు మాట్లాడుతూ గడపండి. అక్కడ మీరేమీ కొననవసరం లేదు. అలాగే మరో షాపుకు వెళ్ళి, అక్కడ షాపు యజమాని ఖాళీగా వుంటే, అతనితో ఓ అయిదు నిముషాలపాటు, చిరునవ్వుతో సంభాషించండి. అలాగే మీకు కావలసిన వివరాలు తెలుసుకోవడానికి, రోడ్డుపై మీకు కనిపించిన అపరిచిత వ్యక్తిని ఆపండి. ఇలా కొత్త వ్యక్తులెవరితో సంభాషించారో నోట్‌బుక్‌లో వ్రాసుకోండి.

మీరు ఏదైనా హోటలుకు వెళ్ళినప్పుడుకాని, రైల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు గాని, బస్సుస్టాపులో నిలుచుని వున్నప్పుడు కాని, మీ చుట్టూ అపరిచిత వ్యక్తులెందరో వుంటారు. వారిలో ఒకరికి, మిమ్మల్ని పరిచయం చేసుకోండి. ఆ వ్యక్తితో సంభాషించడం ప్రారంభించండి. అలాగే అక్కడవున్న మరోవ్యక్తితో సైతం, మీరే చొరవ తీసుకొని, సంభాషించండి. ఎదుటి వ్యక్తి ఏ ప్రాంతానికి చెందినవాడో అడిగి, ఆ పట్టణం గురించి, ఆ గ్రామం గురించి వివరాలు అడగండి. అలాగే, మిమ్మల్ని గురించి ఎదుటి వ్యక్తి అడిగే ప్రశ్నలకు, సహనంతో, నిజాయితీతో సమాధానాలివ్వండి.

ఇంతకుముందే తెలిసినా, ఇప్పుడు పరిచయం పెంచుకోవాలనుకొంటున్న వారి పేర్లు నోట్‌బుక్‌లో పొందుపరచండి. వారిని ఒక్కొక్కరిని కలవడం ప్రారంభించండి.

# సాహిత్య పరిశోధన - సిద్ధాంతాలు

– నాగళ్ళ గురుప్రసాదరావు

ముందుగా ఈ వ్యాసం పరిమితిని గూర్చి నాలుగు మాటలు చెప్పాలి. దీనికి తలకట్టుగా స్వీకరించిన పేరును వివరించితే సరిపోతుంది. సాహిత్యం యొక్క పరిశోధన సాహిత్య పరిశోధన. పరిశోధకులు సాక్ష్యాధారలతో చేసే తీర్పులు సిద్ధాంతాలు.

మరి సాహిత్యమంటే ఏమిటి? అది వాఙ్మయంలో – సారస్వతంలో ఒక భాగం. ఆనాటి నుండి నేటిదాకా సాహిత్యాన్ని ఎందరో మనీషులు ఎన్నో విధాలుగా నిర్వచించారు. ఈ వ్యాసానికి సంబంధించినంత వరకూ ''..... రచన సుందరమై, సార్వజనీన ప్రయోజనము కలిగి, భావనాత్మకమైన ఆహ్లాదము నిచ్చుచు, కర్త యొక్క ఆత్మీయతను స్ఫురింపజేయు గ్రంధము కావ్యము. ఆ కావ్యజాలమే సాహిత్యము. ఆ సాహిత్యమొక కళ' అని సాహిత్యాన్ని నిర్వచించుకుంటే సరిపోతుంది. ఈ సాహిత్యం ఛందోబద్ధ రచనలతో ఛందోరహిత రచనలతో కూడినది కావచ్చు. నిబద్ధ కావ్యాలూ, అనిబద్ధ కావ్యాలూ దీనిలో చేరవచ్చు. అది దృశ్య రూపంగానూ, శ్రవ్య రూపంగానూ ఉండవచ్చు. ప్రాచీన కాలానికీ, నవీన కాలానికీ చెందినవి కావచ్చు. ఏ భేదానికీ ఈ వ్యాసంలో చోటు లేదు.

పరిశోధన అనే పదానికి సి.పి. బ్రౌన్ దొర తన తెలుగు–ఇంగ్లీషు నిఘంటువులో ""Enquiry" అనీ, పరిశోధించుట అనే భావకార్థానికి ""To examine, Investigate; To try, Search" అనీ అర్థాలు చెప్పాడు. సూర్యారాయాంధ్ర నిఘంటువు పరిశోధనము, పరిశోధము పర్యాయ పదాలని చెప్పి, మిక్కిలి శోధించుట అనే అర్థాన్నిచ్చింది. పరిశోధించు అంటే వెదుకు అని అన్నది.
ఇక సిద్ధాంతం అంటే బ్రౌన్ దొర ""Demonstration, Established Truth, Principle, Conclusion, Result, Decree, A mathematical Work, రాద్ధాంతము, స్థాపనము, నిర్ణయము, నవవిధ జ్యోతిర్గ్రంధము, సూర్య సిద్ధాంతము, ""A Celebrated Mathematical Work" అని చెప్పాడు. సూర్యారాయాంధ్ర నిఘంటువు ఈ పదానికి ''వాద ప్రతివాదముల పిదప నిశ్చయ పఱుపబడిన పక్షము, నవనిధి జ్యోతిషగ్రంధములు, పూర్వవాద భేదము, నిర్ణయము'' అనే అర్థాలిచ్చింది.

కాబట్టి ప్రాచీన కాలానికిగానీ, నవీన కాలానికి గానీ సంబంధించిన సాహిత్య ప్రక్రియల విషయంలో పరిశోధకులు, విమర్శకులు, సహేతుకంగా చేసిన నిర్ణయాలు సాహిత్య పరిశోధన సిద్ధాంతాలనే పేరుకు యోగ్యములవుతాయి.

పరిశోధన పవిత్రకార్యం. విజ్ఞానాత్మకమైన ప్రజాసేవ. ప్రలోభాలను అధిగమించి నట్టిది. సత్యం దాని లక్ష్యం. పరిశోధకునకు చిత్తశుద్ధీ, నిర్విరామకృషీ, ప్రముఖ లక్షణాలు కావాలి. తన 'అభిరుచులను, ఇష్టానిష్టాలను, త్రోసిరాజన గలిగిన చిత్తౌన్నత్యం ఉండాలి. పూర్వసిద్ధాంతాలతో పరిశోధనకు పూనుకొనకుండా, సాధ్యమైనంత వరకూ, లభించినంతమేరకు సాక్ష్యాలను సేకరించి సహేతుకమయిన సిద్ధాంతాలు చేయగలిగిన సంయమనం, ప్రతిభా అతనిలో సమృద్ధిగా ముడిపడిన ఆసక్తీ, పాండిత్యమూ, లేని నాడు అతను పరిశోధనకు పూనుకొని అవిచార రమణీయాలైన సిద్ధాంతాలు చేయటం సాహిత్య ప్రపంచంలో అపచారంగానూ, పాపంగానూ పరిగణించాలి. అది సాహితీ పరులను పెడదారులు పట్టించటమే అవుతుంది.

అయితే ఎవరూ సర్వజ్ఞులు కారు. భ్రమ ప్రమాదాలు ఎంతటి విద్వాంసునికయినా తప్పవు. వాటిని సహృదయత్వంతో స్వీకరించి సవరించుకోవచ్చు. అంతే కాకుండా కాలాంతరాన లభించిన సాక్ష్యాలు, పూర్వ సిద్ధాంతాలను పరాస్తం చేస్తాయి. కాబట్టి పరిశోధకులు ఈ విషయంలో పరాకుగా ఉండరాదు. నిత్య జాగరూకత మనం స్వేచ్ఛకు చెల్లించే మూల్యమని రాజనీతికోవిదులంటారు. ఈ సత్యం సాహిత్య పరిశోధనకు లెస్సగా అన్వయిస్తుంది.

అయితే సంచలనం సృష్టించి స్వల్పకాలమైనా సరే విద్వావంతుల హృదయాలను తన వైపుకు ఆకర్షించుకునే ప్రకృతి మానవప్రవృత్తిలోనే ఉన్నది. అది ఏ రంగంలోనయినా గోచరిస్తూనే ఉంటుంది. సాహిత్య క్షేత్రమూ ఒక్కొక్కసారి దాని బారి పడుతుంది. ''నన్నెచోడుడు కుమార సంభవం వ్రాయలేదు. మానవల్లి రామకృష్ణ కవిగారి సృష్టి అది'' అని నిర్ణయించటమూ, శ్రీశ్రీ కంటే ముందు పరిగణించదగిన సాహిత్యమే లేదనటమూ సంచలన సృష్టికోవకే చెందుతాయి.

పాశ్చాత్య సంస్కృతి సంబంధం వల్ల భారతదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనం ప్రారంభమైనదన్న మాటకు ఎదురు లేదు. భారతదేశ భాషా సాహిత్యాలు దీనివల్ల అపూర్వ వికాసాన్ని సంతరించుకొన్నాయి. ఆ వికాసాన్ని సూచించే ప్రముఖ లక్షణాల్లో పరిశోధన ఒకటి. భారతీయులు ప్రపంచంలో ఏ నాగరక భాషలోనూ సాక్షాత్కరింపని సాహిత్యశాస్త్రాన్ని వేలకొలది ఏండ్లనాడే సృష్టించటానికి శ్రీకారం చుట్టారనటం అతిశయోక్తి కాదు, అసత్యమూ కాదు. కాని రెండు శతాబ్దుల నుండి పరిశోధన అనే పేరుతో ప్రచలితమైన వ్యాసంగం భారతీయులకు తెలియదు. అది విజ్ఞానతృష్ణ కలిగిన పాశ్చాత్యులూ వారి అడుగు జాడల్లో నడిచిన భారతీయులూ ప్రారంభించి, వర్ధిల్లజేసినట్టిది.

ఈ పరిశోధన బహుముఖంగా కొనసాగింది. ప్రాచీన కావ్యాలను పరిష్కరించి ప్రకటించటం దానిలో ఒక ప్రధానభాగం. ఆంధ్ర భాషకు సంబంధించినంత వరకూ నిష్కామ బుద్ధితో, పరోపకార పరాయణత్వంతో ప్రాచీన కావ్య పరిష్కారమునకు నాంది పలికిన మహాశయుడు సి.పి. బ్రౌన్. ఆయన చేసిన సాహిత్య సేవను అసందర్భంగా ఇప్పుడు ఏకరువు పెట్టనక్కరలేదు. దానికిది స్థానమూ కాదు. ఆ ఆంధ్ర సాహిత్య పిపాసి పాటించిన పరిష్కరణ పద్ధతుల పాథేయాన్ని పరిగ్రహించి, ఆ అగ్రగామి చూపిన మార్గాల్లో ముందుకు వెళ్ళిన ఎందరో పండిత ప్రకాండులు, ఆంధ్రపరిశోధకులు మనకు గోచరిస్తారు. ఈనాడు ముఖ్య సాంఘిక లక్షణాలయిన స్వార్థమూ, పదవీ వ్యామోహమూ, ధనదాహమూ వారిలో మచ్చు కయినా కనపడవు. స్వస్థాన భాషాప్రీతితో, త్యాగబుద్ధితో వారు సాహిత్య సేవ చేశారు. ఆంధ్రజాతిని విజ్ఞానవంతమైనదానిగా రూపొందించాలన్నదే వారి తపన. ఆ పుణ్య మూర్తుల నందరినీ ఈ ప్రపంచ మహాసభ సమయాన స్మరించుకొని అయినా కొంత అప్పును తీర్చుకోవటం మన విధి. అనాడు కవి కాల కర్తృత్వాలూ, కావ్య విమర్శలూ, వివాదాలకు దారితీశాయి. విఖ్యాతి గాంచిన విద్వాంసులు వాటిల్లో పాల్గొన్నారు. అఖండమయిన చర్చలు గావించారు. వాటివల్ల అపారంగా పరిశోధన సారస్వతమూ, విమర్శ సారస్వతమూ వర్ధిల్లాయి. సాహిత్యపరులకు ఎంతో ఉపకారం జరిగింది. ప్రాచీనులు తరువాతి తరాల వారికి సంక్రమింపజేసిన సాహిత్య సంపదను పుష్కలంగా అనుభవించటానికి అవకాశం కలిగింది.

అయితే ఆనాటి గ్రంథ పరిష్కరణమూ, సాహిత్య చర్చలూ సర్వ కాలాల వారికీ శిరోధార్యాలని చాటటం సత్యదూరం. బ్రౌన్‌దొరగారి పేరు చెప్పకుండా ఆయన పరిష్కరించిన పూర్వ కావ్యాలను ఆధారంగా చేసికొని, పూర్తిగా ఉపయోగించుకుని తాము కష్టపడి ఆ కావ్యాలను ఆవిష్కరించినట్టు

టముకు వేసిన సత్య గోపాయకులూ, ఉత్తర వంశాది కావ్యాల్లో సొంత కవిత్వం చేర్చిన గోత్రోద్ధారకులూ, తాము శరణాగతి శాస్త్రాలుగా సంభావించిన ఛందో వ్యాకరణ గ్రంథాలను బట్టి కవి పాఠాలను స్వేచ్ఛగా దిద్దిన కూటకరణ నిపుణులూ కొందరు ఆనాటి పరిశోధకుల్లో కనబడతారు. వారు చేసిన చేష్టలను ఇతర పరిశోధకులూ, శ్రీ గిడుగు రామమూర్తి వంటి విద్వదగ్రగణ్యులూ ఖండించటం అందరికీ తెలిసినట్టిదే.

అతివాదదోషం పాలుగాకుండా ఒకటి రెండుదాహరణలు చూపాలని ముచ్చట పడుతున్నాను. కవిబ్రహ్మ తిక్కన రచించిన మహాభారతంలో అశ్వమేధ పర్వ చతుర్థాశ్వాసంలోని 87వ సీసపద్యం ఎత్తుగీతిలో చివరిపాదం–

''ఏవి నరకవాసమునకు బోవలయు''

అని రామా అండ్ కో వారు, వావిళ్ళ వారు ప్రకటించిన భారత ప్రతుల్లోనే కాకుండా, బహుతాళపత్ర ప్రతులను సంప్రతించి ఉస్మానియా విశ్వవిద్యాలయము ప్రకటించిన ''సంశోధిత ముద్రణము''లో కూడా ఉన్నది. ఈ పాదంలో యతి తప్పింది. ''ఏ–పో''లకు తిక్కన యతి వేశాడని యనటం శాస్త్ర విరుద్ధమే కాకుండా మహాపచారం అవుతుంది. పరిష్కర్తలు ఈ పాదానికి పాఠాంతరాలు చూపలేదు కాబట్టి ఇది

''ఏవి నరకవాసమునకు నేగవలయు''

అని యుండదగునని నేననుకొనుచున్నాను.

మరొక పాఠం మనవి చేస్తాను. విరాటపర్వ ప్రథమా శ్వాసంలో 101వ సీస పద్యంలోని ఆటవెలది మూడోపాదంలో

''ముచ్చు మెలగిన వెలకొట్ట''

అని వావిళ్ల ప్రతిలోనూ, ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రతిలోనూ ఉన్నది. శ్రీ చదలవాడ సుందర రామశాస్త్రులూ, శ్రీ దండిగుంట సూర్యనారాయణ శాస్త్రులూ రచించిన ''భారత సంజీవని'' వ్యాఖ్యతో కూడిన విరాటపర్వ ప్రతిలోనూ, రామా అండ్‌కో వారి ప్రతిలోనూ ఇది అధస్సూచికలో పాఠాంతరంగా చూపబడింది. ఈ ''వెలకొట్టు'' అనే ధాతువు నిఘంటువుల కెక్కలేదు. కాని తిక్కన పదప్రయోగ కోశంలో నిలిచింది. తిక్కన ప్రజాభాషకు పట్టం కట్టిన కవిబ్రహ్మ అని గుర్తించిన వారు ఆయన ''వెలకొట్టు'' ధాతువును ఉపయోగించారంటే ఆశ్చర్య పడరు. ఈ ధాతువునకు వెళ్లగొట్టు, పారద్రోలు అని అర్థం చెప్పుకోవాలి. వెడలగొట్టు అనే ధాతువు వెలలగొట్టు, వెళ్లగొట్టు, వెలకొట్టు అని మారిందేమో విద్వాంసులాలోచించాలని నా మనవి.

ఇక శాస్త్రదాస్యం శిఖరస్థాయికి చేరితే పరిష్కర్తలు కవి పాఠాలను ఏ విధంగా వెనక ముందు ఆలోచించకుండా దిద్దుతారో ఒక ఉదాహరణమిచ్చి ఈ భాగం ముగిస్తాను.
సహజ పాండిత్యుడైన పోతన మహాభాగవతాన్ని తెలిగిస్తూ మొట్టమొదటనే

''శ్రీకైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు, భక్తపాలన కళాసంరంభకున్.....''

ఇత్యాదిగా ఇష్టదేవతా ప్రార్థనం గావించాడు. ఈ పద్యంలో రెండవ పాదంలో అఖండయతి ఉన్నది.

అప్పకవి యనుయాయులకు మింగుడు పడనట్టి యతి ఇది. అందువల్లనే పరిష్కర్త ''రక్షాకారంభకు'' అని ధైర్యంగా దిద్ది పోతనకు అఖండయతిదోషం అంటకుండా చేసి పుణ్యం కట్టుకున్నాడు. అయితే ''రక్షాక'' పదాన్ని గూర్చిగానీ, దాని యర్థాన్ని గూర్చిగానీ ఆయన ఆలోచింపలేదు.

ఇరవయ్యో శతాబ్దిలో సాహిత్య పరిశోధన విరాడ్రూపంలో విస్తరిల్లింది. దీనికి విశ్వవిద్యాలయాలు ప్రధాన కేంద్రాలయ్యాయి. వాటిల్లో పీఠాధిపతులయిన ప్రాచార్యులూ, ఆచార్యులూ, ఉపన్యాసకులూ స్వదేశ విదేశాల పండితుల ప్రశంసలు పొందిన యుత్కృష్ట పరిశోధన గ్రంథాలు ప్రకటించారు. ఎంతోమంది సాహిత్యవటువులకు శాస్త్రలై పరిశోధనకు వన్నెచిన్నెలు వచ్చునట్లు శ్రమించారు. కవులూ, వారి కావ్యాలూ, కావ్యగత కళావిశేషాలూ మొదలైన అంశాలెన్నో పరిశోధన ప్రమేయాలయ్యాయి. మార్గదేశి సాహిత్య ప్రక్రియల గూర్చి గాఢమైన పరిశోధన కొనసాగింది. కొన్ని విశ్వవిద్యాలయాలు ప్రాచీన గ్రంథ పరిష్కారాన్ని పరిశోధన భాగంగా పరిగణించాయి.

విశ్వ విద్యాలయాలతో పాటు సాహిత్య అకాడమీలూ, సాహిత్య సంస్థలూ, సాహిత్య ప్రియులూ, ఎన్నో పరిశోధన గ్రంథాలు ప్రకటించాయి. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ సంస్థలు కూడా పరిశోధనకు పట్టు గొమ్మలయ్యాయి. యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్ నియమాలు పరిశోధన నానాముఖాలుగా పెంపొందటానికి మూల కారణాలయ్యాయి. అనుబంధ కళాశాలల ఆంధ్రోపన్యాసకులు పరిశోధన రంగంలో ముందంజ వేసి ప్రశంసనీయమైన కృషి చేశారు, చేస్తున్నారు.

విజ్ఞానదాయకమైన ఈ కృషిని వేనోళ్ల పొగడవలసిందే. కానీ పరిశోధన క్షేత్రం హద్దులు పెరిగిన కొలది నిస్సారమైంది. అత్యల్ప వ్యవధిలో పంట చేతికి రావాలనీ, ఫలసాయం అనుభవించాలనీ పరిశోధకులు కృషి చేయటం మొదలయింది. దీనివల్ల ప్రామాణికత్వం పంచ బంగాళమయింది. మూలగ్రంథ పరిశీలనం మృగ్యమైంది. పరిశోధకులు పరాభిప్రాయ భుక్కులయ్యారు. అపసిద్ధాంత కర్తలయ్యారు. సర్వజ్ఞతారోపణం చేసికొని బిభీషికలు కొట్టడం, సాధికార నిర్ణయాలు చేస్తున్నట్టు నటించటం పరిశోధనకు ప్రాణభూతమయింది. ''ఒక గ్రంథంలోని విషయాలను గ్రహిస్తే చౌర్యం, పది గ్రంథాల్లోని సమాచారాన్ని సంగ్రహిస్తే పరిశోధన'' అనే ఆభాణకం లోకంలో వ్యాపించింది. మంది ఎక్కువైన కొలదీ మజ్జిగ పలచనవుతుంది. విశ్వవిద్యాలయాలూ, సాహిత్య అకాడమీలూ, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ సంస్థలూ, ఆంధ్రోపన్యాసకులూ ప్రకటించిన గ్రంథాల్లోని పరిశోధన సిద్ధాంతాలను నా అభిప్రాయాలకు ఉపోద్బలంగా ఉదహరిస్తాను.

ఆంధ్ర విశ్వవిద్యాలయం ''ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు'' అనే సిద్ధాంత ప్రబంధాన్ని ప్రకటించింది. దానిలో రచయిత్రి సంస్కృత సాహిత్య శాస్త్ర గ్రంథాల నుండి ఉల్లేఖనము లిచ్చింది. సంస్కృత కావ్యాలను గూర్చి చెప్పింది.

''పరిక్రియా పురాకల్ప ఇతిహాసగతి ర్ద్విధా
స్యాదేక నాయకా పూర్వా, ద్వితీయా బహునాయకా''

అని ఇతిహాసము–ఇతిహాసము, ప్రక్రియ అని రెండు విధములని, ఇతిహాసము ఏకనాయకాశ్రయము, పరిక్రియ బహునాయకా శ్రయమని రాజశేఖరుడు కావ్య మీమాంస యందు వివరించెను'' అని (పుట.3) రచయిత్రి సాధికారంగా నిర్ణయించారు. రచయిత్రికి రాజశేఖరుని శ్లోకం అర్థం కాలేదు. ఆ యాయావరీయుడు ''పరక్రియ యనియు, పురాకల్పమనియు, ఇతిహాసముల పద్ధతి రెండు

విధములు. ఒక్క నాయకుడు మాత్రమే ఉన్నది మొదటిది - పరిక్రియ. బహునాయకులు కలది రెండవది - పురాకల్పము. వీటికి వరుసగా రామాయణ భారతములు ఉదాహరణములు'' అని స్పష్టంగా చెప్పాడు.

ఇతిహాసం, పరిక్రియా పురాకల్పమూ అనే రెండు రకాలని రాజ శేఖరుడు చెప్పు చుండగా రచయిత్రి ఇతిహాసం-ఇతిహాసం, పరిక్రియ అని రెండు విధాలంటున్నది. ఇతిహాసం ఇతిహాసభేదం అవుతుందా?

ఈ సిద్ధాంత ప్రబంధం 20వ పుటలో రచయిత్రి ''సంస్కృతమున తొలి చారిత్రక కావ్యములు అశ్వ ఘోషుని బుద్ధచరిత్రము, సౌందరనందము. బుద్ధచరిత్రము బౌద్ధమతమును తెలుపు పదియేడు సర్గల కావ్యము. సౌందరనందము బుద్ధుని పితృవ్య పుత్రుడగు నందుని చరిత్రము గల ఇరువది సర్గల కావ్యము'' అని వక్కాణించింది.

ఈ మాటలు రచయిత్రి అపరిశీలన వ్యాసంగమునకు ప్రబలోదాహరణలు. వీటిల్లో ఐదారు తప్పులున్నవి.

బుద్ధచరిత్రము బౌద్ధమతాన్ని గూర్చి తెలియజేయదు. జననం నుండి నిర్వాణం వరకూ బుద్ధుని జీవితాన్ని వర్ణించే మహాకావ్యం. అది 17 సర్గల కావ్యం గాదు. మరి 28 సర్గల కావ్యం.

ఈ నాడు సంస్కృత బుద్ధచరితం 14వ సర్గలోని 31వ శ్లోకం దాకా మాత్రమే లభించింది. టిబెట్టు చైనా భాషానువాదాలను బట్టి అది 28 సర్గల మహాకావ్యమని తెలిసింది. 14వ సర్గలోని 32వ శ్లోకం నుండి 17వ సర్గ వరకు అమృతానందుడు అనే కూట లేఖకుడు తన కవిత్వాన్ని బుద్ధ చరితంలో ప్రక్షిప్తం చేశాడు. చైనా భాషానువాదం కంటే టిబెట్టు భాషానువాదం సంస్కృత మాతృకకు సన్నిహితమని వింటర్నిడ్జ్ అభిప్రాయం.

సౌందరనందం నందుని చరిత్రాన్ని తెలియజేసే కావ్యమన్న మాట నిజమే. నందుడు బుద్ధుని పితృవ్యపుత్రుడు - పినతండ్రి కొడుకో, పెదతండ్రి కొడుకో - కాడు. మరి ఆ భగవానుని సవతి తమ్ముడు. సౌందరనందం 18 సర్గలున్న మహాకావ్యం. దానిలో రచయిత్రి చెప్పినట్టు 20 సర్గలు లేవు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 'తెలుగు కవితా వికాసం (1947-1980)' అనే గ్రంథాన్ని ప్రకటించింది. ఇది శతాధిక దోషాలున్న గ్రంథం. రెండు దోషాలు మాత్రమే మీకు చూపుతాను. ''తార్కికులకూ, వైయాకరణులకూ, మీమాంసకులకూ కావ్యానందం కలుగదని ఆనందవర్ధనుడు ఆక్షేపించాడు'' (పుట 181) అని రచయిత ఆనంద వర్ధనుని మీద పెద్ద అభాండం వేశాడు. వారు ధ్వన్యాలోకాన్ని చదువలేదు కాబట్టి ఈ అపచారానికి ఒడిగట్టారు. ఇంతకూ ఏ యుద్యోతంలో ఆనందవర్ధనుడీ మాట అన్నాడో వారు చెప్పిన పాపాన పోలేదు.

ఆనందవర్ధనుడు వైయాకరణులకు - అలంకార శాస్త్రానికీ, వ్యాకరణానికీ అవినాభావ సంబంధం ఉన్నది కాబట్టి - పెద్ద పీట వేశాడు. ఆ మహాశయుడు మొదటి ఉపోద్ఘాతంలోనే ''సర్వ విద్యలకూ మూలం వ్యాకరణం కాబట్టి వ్యాకరణ వేత్తలే విద్వాంసులలో మొదటివారు'' (ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః; వ్యాకరణ మూలాత్వాత్ సర్వ విద్యానామ్) అని విశదంగా చెప్పాడు. ఈ రచయిత గ్రంథం రచించటానికి తోడ్పడిన గ్రంథాల్లో వేదాల తిరువెంగళాచార్యుల వారి ఆంధ్రధ్వన్యాలోకం

కూడా చేరింది. ఆచార్యుల వారు 79వ పుటలో ఏమి చెప్పారో వారు చదివినట్టు లేదు.

అయితే రచయిత దారితప్పటానికి కారణం లేకపోలేదు. వారు సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి వ్యాఖ్యానంతో కూడిన కావ్యాలంకార సంగ్రహం మాత్రమే చదివారు. ఆ గ్రంథం 285వ పుటలో ''కావుననే మీమాంసకులకును వైయాకరణులకును రసాస్వాదము కలుగదని యానందవర్ధనాచార్యులవా రన్నారు'' అనే వాక్యమున్నది. రచయిత తార్కికులను కూడా జతచేసి ఆ వాక్యాన్నే యథాతథంగా ఉదహరించారు.

సూర్యనారాయణశాస్త్రిగారు పొరపడ్డారు. ఈ విషయమై నేను వారికి లేఖ వ్రాశాను. వారు 23-2-1982వ తేదీనాడు తమ పొరపాటును అంగీకరిస్తూ తిరిగి నాకు జాబు వ్రాశారు.
ఈ 'తెలుగు కవితా వికాసం' రచయిత 81వ పుటలో ''శ్రీ తుమ్మల సీతారామమూర్తి 1936లో గాంధీజీ స్వీయచరిత్రను పద్యకావ్యంగా రచించడం ఆరంభించి ఆత్మకథ పేరుతో దాన్ని బాపూజీ మరణానంతరం వెలువరించారు'' అని ధీరంగా చెప్పారు. ఈ మాటలు రచయిత ఊహాగానానికి తార్కాణాలు.

శ్రీ తుమ్మల 1936లో గాకుండా 2-10-1932న ఆత్మకథా రచనకు శ్రీకారం చుట్టారు. 1936లో ఆ కావ్యంలోని 'తొలిపాలు'ను ప్రకటించారు. 26-1-1951కి గాని ఆత్మకథా రచనం పూర్తికాలేదు. తుమ్మల 1936లో ప్రకటించిన ప్రథమభాగాన్ని చాలాచోట్ల సవరించి, సంపూర్ణ కావ్యాన్ని 1951 మార్చిలో ప్రచురించారు.

ఈ తేదీల ఇంద్రజాలానికి సంబంధించి విచిత్రమయిన యుదాహరణలు చూపుతాను. కేంద్ర సాహిత్య అకాడమీ వారు ''భారతీయ సాహిత్య నిర్మాతలు'' అనే గ్రంథమాల క్రింద శ్రీ గిడుగు రామమూర్తిగారిని గూర్చి ఒక గ్రంథం వ్రాయించారు. దాన్ని ఒక విశ్వ విద్యాలయాచార్యులవారు రచించారు. వారు ఆ లఘు గ్రంథంలో 55వ పుటలో ''అందుకే 1912లో గురజాడ అప్పారావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఒక లేఖ రాస్తూ రామమూర్తిగారిని రీడర్‌గా నియమించాలని సిఫార్సు చేశారు'' అని వక్కాణించారు. ఈ మాటలు చాలా విడ్డూరంగా ఉన్నవి. అప్పారావుగారు 1915 నవంబర్ 30వ తేదీన మరణించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం 1926 జనవరి 26వ తేదీన ఏర్పడింది. అప్పటికే దేహం చాలించిన అప్పారావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఏ విధంగా లేఖ పంపారు!

'శిల్పకళాక్షేత్రాలు' అనే పేరుగల గ్రంథాన్ని రెండు సంపుటాలుగా రచించిన శిల్పాచార్యులొకరు అడివి బాపిరాజుగారిని గూర్చి వ్రాస్తూ ఆంధ్రప్రభుత్వం ఆ చిత్రకళాకోవిదుని చేత సిగిరియా చిత్రాలకు ప్రతికృతులు వ్రాయించిందని అన్నారు. ఇట్లనటం చాలా పెద్ద తప్పు. అడివి బాపిరాజుగారు 1952లో మరణించారు. ఆనాటికి ఆంధ్రరాష్ట్రం అవతరింపనూ లేదు, ఆంధ్రప్రభుత్వం ఏర్పడనూ లేదు. ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం శ్రీలంకలో ఉన్న సిగిరియా చిత్రాలకు ప్రతికృతులు అడివి బాపిరాజుగారి చేత 1948 ప్రాంతాల్లో తీయించింది. వాటిని ఈనాడు కూడా ఎగ్మూరు మ్యూజియంలో చూడవచ్చు.

కొందరు పరిశోధకులు ఎంత నిర్లక్ష్యంగా సిద్ధాంతాలు చేస్తూ గ్రంథాలు రచిస్తారో చెప్పటానికి మచ్చుగా 'మధ్యే మధ్యే' అనే వ్యాస సంపుటాన్ని చూపవచ్చు. ఈ సంపుటం 6వ పుటలో ''గాసట బీసటే చదివి గాథలు త్రవ్వతెలుంగు వారికిన్ వ్యాసముని ప్రణీత''మైన మహాభారత గాథను

వివరిస్తున్నానని నన్నయభట్టు ఒకచోట చెప్పాడని రచయిత అన్నారు. ఆ మాటలు నన్నయ్యవి గావు. మరి ఎఱ్ఱాప్రెగ్గడవి. ఆ ప్రబంధపరమేశ్వరుడు నన్నయ్య తిక్కనలను గూర్చి లక్ష్మీ నృసింహావతారంలో పలికినట్టివీను.

92, 93 పుటల్లో శ్రీ శనగన నరసింహస్వామి 'వంశవృక్ష' నవలను కన్నడం నుంచీ, శ్రీ డి. రామలింగం ధర్మానంద కౌశాంబీ గ్రంథాన్ని 'బుద్ధభగవానుడు' పేరుతో మహారాష్ట్ర భాషనుంచీ అనువదించారని రచయిత పేర్కొన్నారు. ఇంతకంటే దారుణం మరొకటి లేదు. మొదటిదాన్ని మదనపల్లి బెసెంట్ థియోసాఫికల్ కళాశాలలో భౌతిక శాస్త్ర శాఖాధిపతి అయిన సనగరం నాగ భూషణంగారూ, రెండోదాన్ని పుట్ట పర్తి నారాయణా చార్యులవారూ తెలిగించారు.

''జాతీయోద్యమ వైఫల్యం కారణంగా కవులలో రేకెత్తిన నిరాశా నిస్పృహలే కృష్ణ శాస్త్రి విషాద గీతాలలో ద్యోతకమయి వుంటాయి'' అని రచయిత యొక తీర్పు చేశారు. ఇది మార్క్సిజం అసూయ నుండి ఆవిర్భవించిందని కొందరు పాశ్చాత్య రచయితలు వ్రాసినట్టుగా ఉంది. అంతేకాకుండా సమకాలిక సంఘిక రాజకీయ పరిస్థితులకూ, సాహిత్యానికీ ముడిపెట్టే రచయిత ఆరాటాన్నీ సూచిస్తుంది. కృష్ణపక్షం 1925లోనూ, ప్రవాసము, ఊర్వశి 1929లోనూ వెలువడినాయి. వీటి రచన ఆ రెండు సంవత్సరాలకు ముందే సాగింది. కృష్ణశాస్త్రి పేరు భావకవిత్వానికి పర్యాయపదమయింది. ఆంగ్లసాహిత్యంలోని కాల్పనికవాదమూ, రవీంద్రుని రచనలూ తెలుగులో భావకవిత్వం ప్రబలటానికి హేతువులయ్యాయి. అదీగాక ఆంధ్రదేశంలోని సాంఘిక పరిస్థితులు కూడా దానికి దోహదం చేశాయి. అనాటికి కృష్ణశాస్త్రి ప్రభృతులు కోడె వయస్సులో ఉన్నారు. సాంఘిక సంస్కారోద్యమ ఫలంగా స్త్రీ విద్యావశ్యకం గుర్తించబడింది. యువతీయువకులు విద్యాలయాల్లో సభల్లో స్వేచ్ఛగా చదువుకుంటూ పాల్గొంటూ పరస్పరం సల్లాపాలు సాగించే కాలమది. యువకవులు తమ కంటబడిన సుందరి నుద్దేశించి ప్రేమగీతాలు రచించటానికి పూనుకున్నారు. వీరిలో కొందరు తాము మెచ్చిన సౌందర్యానికి సంకేతంగా ఒక ఊహాసుందరిని సృష్టించుకొని ఆమెయే నాయికగా ప్రణయగీతాలు పాడారు. మరికొందరు ప్రేమించిన వలకారి చిన్నది ప్రాప్తింపక, వియోగ గీతాలు ఆలాపించి విషాదం వల్లనే మనస్సుఖ శాంతులు పొందారు. కృష్ణశాస్త్రి విషాద గీతాలకు మూలకారణాలివే.

విప్లవ సాహిత్య సిద్ధాంతాలను విశ్వసించి, ప్రాచీన సంస్కృతాంధ్ర సాహిత్యాలనూ, భారతీయ సాహిత్య శాస్త్రాన్నీ పరిశీలింపకుండా, పరాభిప్రాయాలను ప్రామాణికాలుగా భావించి పరిశోధనకు పూనుకుంటే ఎటువంటి రచనం వెలుగు చూస్తుందో 'ఆధునిక తెలుగు కవిత్వం – వాస్తవికత అధివాస్తవికత' అనే సిద్ధాంత ప్రబంధం రుజువు చేస్తుంది.

ఈ రచయితకు స్వతంత్రమయిన అభిప్రాయాలు లేవు. పురస్సిద్ధాంతాలతో పరిశోదనకు పూనుకోవడమే దానికి కారణం. మనస్సులో అలల్లాగా చెలరేగే భావాలను సత్యసమ్మతాలో కావో పరిశీలించకుండా ప్రకటించడం చేత ఈ సిద్ధాంత ప్రబంధం పాఠకుల భావజగత్తులో గందరగోళం సృష్టిస్తుంది. రచనకూడా క్రమబద్ధంగా కానరాదు.

దాదాపు పాతికేళ్ళ నుండీ విమర్శక లోకంలో నిబద్ధత అనే మాట ఒక పారిభాషిక పదంగా వినబడుతున్నది. కమిట్‌మెంట్ అనే ఆంగ్లపదానికిది సమానార్థక పదం. కవికి నిబద్ధత ఉంటుందనీ, ఉండాలనీ విప్లవ సాహిత్యశాస్త్రం వక్కాణిస్తున్నది. నేడు ఈ సిద్ధాంతానికి ఉదాహరణంగా ప్రాచీనకవులను ప్రదర్శించడం ఒక విలాసమయింది.

తదనుగుణంగా ఈ సిద్ధాంత ప్రబంధ రచయిత జైన బౌద్ధమతాల వల్ల దెబ్బతిన్నవైదిక మతాన్ని పునరుద్ధరించే నిబద్ధతతో నన్నయ భారతాన్ని కళాత్మకంగా తెలిగించాడని 48,94 పుటల్లో వక్కాణించాడు. ఈ పాట అర్ధశతాబ్దికి పైగా పాడి పాడి పాచి పట్టింది. నన్నయ రాజరాజ నరేంద్రుని ఆదేశం శిరసావహించి భారత రచనకు పూనుకోవటం నిజం. ఇంతకంటె నన్నయ నిబద్ధతకు వేరే అంతరంగ సాక్ష్యం లేదు. ఆ మహాకవి లక్ష్యం వైదిక మత పునరుద్ధరణమని చెప్పటానికి సాక్ష్యాలు లేవు.

పైగా ఆంధ్ర దేశంలో మతస్థితి తద్భిన్నంగా ఉన్నది. ఆంధ్రదేశం బౌద్ధ క్షేత్రంగా పరిఢవిల్లినప్పుడే సాతవాహనులూ, ఇక్ష్వాకులూ వైదిక ధర్మ చోదితాలయిన యాగాలు చేశారు. రాజరాజ నరేంద్రునకు ముందే ఆంధ్రదేశంలో వైదిక ధర్మం విజృంభించింది. వివిధ శైవ సమయాలూ, వైష్ణవమూ ఇక్కడ వ్యాపించాయి. యూ వాన్ చ్వాంగ్ క్రీ. శ. 7వ శతాబ్దిలో ఆంధ్రకళింగ దేశాలు పర్యటించాడు. ఆనాటికే బౌద్ధం క్షీణదశకు చేరుకొన్నది. బౌద్ధారామాలు శిథిల మయ్యాయి. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చెప్పినట్టు కన్నడ దేశంలో మాదిరిగా ఆంధ్రదేశంలో జైనం వ్యాపించ లేదు. కాకతీయుల్లో, తూర్పు చాళుక్యుల్లో జైనరాజులున్నా, అక్కడక్కడా ఆంధ్రదేశంలో జైన బస్తీలున్నా ఏనాడూ వైదిక మతం వెనుకంజ వేయలేదు. జైనానికి ప్రతిద్వంద్వంగా శైవం నిలిచింది.

శైవ వైష్ణవ ఘర్షణలూ, కాకతీయులు శైవాన్ని ప్రోత్సహించటం తిక్కన హరిహరనాథ తత్త్వానికి దారి తీసిందంటూ సిద్ధాంత ప్రబంధకర్త 95వ పుటలో

''ఒక ప్రక్క ఆనాడు ఉత్తర భారతాన్ని పరిపాలిస్తున్న మొగలాయి చక్రవర్తులు దక్షిణాన్ని స్వాధీనపర్చుకునే ప్రయత్నాల్లో ఉండడం వల్ల ఆ ప్రమాదాన్ని ఎదుర్కోవటానిక్కూడా శైవ వైష్ణవుల్ని సమన్వయ పరచాల్సిన అవసరం ఏర్పడి ఉంటుంది. ఏమయినా పరస్పరం వ్యతిరేక శక్తులుగా భావించుకొని ఘర్షించుకున్న శక్తుల మధ్య ఐక్యత సాధించటం కోసమే తిక్కన హరిహరనాథుణ్ణి సృష్టించినప్పటికీ ఫలితం ఆనాటి వ్యవస్థలో అంతగా కనబడదు...'' అని నిగ్గు తేల్చారు. వారే 104వ పుటలో

17వ శతాబ్ది చివరి దశకాల్లో భారతదేశ మందంతటా విప్లవాత్మకమయిన మార్పులు వచ్చాయి. రాజ్యస్థాపన కోసం మొఘలులు, వర్తకం కోసం పోర్చుగీసులు భారతదేశంలో ప్రవేశించి, మత సాంఘిక వ్యవస్థల్లో అనేక మార్పులు తీసుకొచ్చారు'' అని ఘంటాఘోషంగా చాటారు.
ఈ వ్రాతలు రచయిత అభిప్రాయాల అవ్యవస్థను చాటుతున్నాయి. ఇక్కడ ముఖ్యంగా ఈ క్రింది మూడు ప్రశ్నలు పాఠకులను ఎదుర్కొంటున్నాయి.

1. మొగలులు ఎప్పుడు భారత దేశంలో ప్రవేశించారు?
2. వారి దక్షిణదేశ దండయాత్రలకూ, తిక్కన హరిహరనాథ తత్త్వానికీ సంబంధ మున్నదా?
3. తిక్కన హరిహరనాథుణ్ణి సృష్టించాడా?

సిద్ధాంత ప్రబంధ కర్త 17వ శతాబ్దిలో మొగలులు భారత దేశంలో ప్రవేశించారనటం తప్పు. మొగలు చక్రవర్తుల్లో మొదటివాడు బాబరు. అతడు ఇబ్రహీంలోడీని జయించి క్రీ.శ. 1526లో ఢిల్లీలో సింహాసనమెక్కాడు. 16వ శతాబ్దిలో మొగలులు భారతదేశంలో ప్రవేశించారు. క్రీ.శ. 1303లో మొట్ట మొదటిసారి ఢిల్లీని పాలిస్తున్న అల్లాయుద్దీన్ ఖిల్జీ సైన్యాలు ఆంధ్రదేశంపై దండెత్తి పరాజయం పొందాయి.

మొగలుల దక్షిణ దేశ దండయాత్రలకూ, తిక్కన హరహరనాథ తత్త్వానికీ పొత్తు కలపటం బోడితలకూ మోకాలికీ ముడిపెట్టినట్లున్నది. తిక్కన ఎప్పటివాడు! మొగలులు ఏ కాలం వారు? తిక్కన క్రీ.శ. 1205–88 మధ్యకాలం.వాడని స్థూలంగా చెప్పవచ్చు. ఆ మహాకవి జీవించిన కాలంలో మొగలులు – 16వ శతాబ్దిలో భారతదేశంలో ప్రవేశించినారు – దండయాత్రలు చేయడానికి వీలేలేదు. ఆయన మరణించిన తరువాత ఢిల్లీ సుల్తానుల దక్షిణదేశ దండయాత్రలు ప్రారంభ మయ్యాయి. తిక్కన హరిహరనాథుణ్ణి సృష్టించినవాడు గాడు. కవిబ్రహ్మ కంటే ముందు కొన్ని వందల యేళ్ళనాడే హరిహరనాథ సృష్టి జరిగింది. పాణినికి పూర్వం నుంచీ వృషాకపిపదం హరిహరాత్మక దేవతామూర్తిని వ్యక్తీకరిస్తున్నదని విద్వాంసులు నిర్ణయించారు. కుషాణరాజు హువిష్కుని నాణెముల మీద హరిహరమూర్తి ఉన్నది. గుప్త చక్రవర్తుల కాలంలోనే హరిహరప్రతిమలు వెలిశాయి. గుజరాత్, రాజస్థాన్, బీహార్ ప్రాంతాల్లో ఆ మూర్తులు ఏర్పడ్డాయి. క్రీ.శ. 578 నాటికే బాదామి గుహల్లో హరిహరనాథుడు కనబడుతున్నాడు. క్రీ.శ. 7–8 శతాబ్ది నాటికే నెల్లూరి జిల్లా భైరవునికోనలో ఆమూర్తి రూపొందింది.

"సముద్రగుప్తుని విజయాల్ని కీర్తించటానికి కాళిదాసు దిలీపుని పాత్రను ఆశ్రయించాడని విమర్శకులు భావిస్తున్నారు" అని 91వ పుటలో సిద్ధాంత ప్రబంధకర్త తన సాహిత్య సిద్ధాంతాలను సమర్థించుకోటానికి ఉటంకించారు. విమర్శకులు భావిస్తున్నారు సరే! ఆ భావం సహేతుకమో? కాదో? వారు పరీక్షించారా? పరీక్షింప లేదు.

కాళిదాసు రఘువంశంలో మొదటి రెండు సర్గల్లోనూ దిలీపుని వృత్తాంతాన్ని వర్ణించాడు. సుదక్షిణావల్లభుడయిన ఆ ప్రభువు నందినీ ధేనువును ఆరాధించి కుమారుని కొరకు వరం పొందుతాడు. అంతటితో ఆయన వృత్తాంతము ముగుస్తుంది. దిలీప మహారాజు ఏ దండ యాత్రలూ చేయలేదు. అతని కుమారుడు రఘుమహారాజు గావించిన దండయాత్రలను కాళిదాసు సుదీర్ఘంగా వర్ణించాడు.

నేను పురోభాగినై ఈ వ్యాసరచనమునకు పూనుకోలేదు. ఈ పరిశోధకులు నాకంటె గొప్పవారని నాకు తెలియును. "గొప్ప వారిని గౌరవించుటకు వారి సిద్ధాంతములను విమర్శించుటయే యుత్తమ మార్గమని యొకానొక పండితుడు వచించిన వాక్యమందు నాకు జాలనమ్మిక గల" దని శ్రీమాన్ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారొక సందర్భంలో చెప్పారు. నాకు వారి మాటల మీద నమ్మకం ఎక్కువ.

*It economics, we speak of booms and busts; in psychiatry, of mania and melancholia. Both are the manifestations of human nature in a state of freedom - in particular, of the fact that, unless adequately constrained by self - discipline, the market fluctuates between manic highs fueled by greed and melancholic lows fueled by fear, while the individual fluctuates between self-assured, self-indulgent overactivity and self-doubting, self-loathing under - activity.*

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
*AMBROSE BIERCE (1911)*

**Satiety,** *n.* The feeling that one has for the plate after he has eaten its contents, madam.

**Sauce,** *n.* The one infallible sign of civilization and enlightenment. A people with no sauces has one thousand vices; a people with one sauce has only nine hundred and ninety-nine. For every sauce invented and accepted a vice is renounced and forgiven.

**Saw,** *n.* A trite popular saying, or proverb. (Figurative and colloquial.) So called because it makes its way into a wooden head. Following are examples of old saws fitted with new teeth.

**Scepter,** *n.* A king's staff of office, the sign and symbol of his authority. It was originally a mace with which the sovereign admonished his jester and vetoed ministerial measures by breaking the bones of their proponents.

**Scribbler,** *n.* A professional writer whose views are antagonistic to one's own.

**Scriptures,** *n.* The scared books of our holy religion, as distinguished from the false and profane writings on which all other faiths are based.

**Seine,** *n.* A kind of net for effecting an involuntary change of environment. For fish it is made strong and coarse, but women are more easily taken with a singularly delicate fabric weighted with small, cut stones.

**Self-esteem,** *n.* An erroneous appraisement.

**Self-evident,** *adj.* Evident to one's self and to nobody else.

***Severalty,*** *n.* Separateness, as, lands in severalty, i.e., lands held individually, not in joint ownership. Certain tribes of Indians are believed now to be sufficiently civilized to have in severalty the lands that they have hitherto held as tribal organizations, and could not sell to the Whites for waxen beads and potato whiskey.

**Sheriff,** *n.* In America the chief executive officer of a country, whose most characteristic duties, in some of the Western and Southern States, are the catching and hanging of rogues.

**Siren,** *n.* One of several musical prodigies famous for a vain attempt to dissuade Odysseus from a life on the ocean wave. Figuratively, any lady of splendid promise, dissembled purpose and disappointing performance.

**Slang,** *n.* The grunt of the human hog (Pignoramus intolerabilis) with an audible memory. The speech of one who utters with his tongue what he thinks with his ear, and feels the pride of a creator in accomplishing the feat of a parrot. A means (under Providence) of setting up as a wit without a capital of sense.

**Sophistry,** *n.* The controversial method of an opponent, distinguished from one's own by superior insincerity and fooling. This method is that of the later Sophists, a Grecian sect of philosophers who began by teaching wisdom, prudence, science, art and, in brief, whatever men ought to know, but lost themselves in a maze of quibbles and a fog of words.

